# భక్త కవయిత్రి
# తరిగొండ వెంగమాంబ
## బుల్లి కథ

సాధారణ సంపాదకులు
**బి.యస్. రెడ్డి (భూమన్)**
సంచాలకులు, తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు,
"శ్వేత", తి.తి.దే. తిరుపతి.




**రచయిత**
**విద్వాన్. జి. సుబ్రహ్మణ్య శాస్త్రి**

ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**
**2009**

# BHAKTA KAVAYITRI TARIGONḌA VEṄGAMĀBA

(BURRA KATHA)

Vidwan G. Subrahmanya sastry

T.T.D. Religious Publications Series No: 20

© All Rights Reserved

First Edition: 2009
Copies : 1000

Published by
I.Y.R. Krishna Rao, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati -517 501

D.T.P. SVETA T.T.D. Tirupati.

Printed at
Tirumala Tirupati Devasthanams, Press.
Tirupati.

శ్రీనివాసో విజయతే

# ముందుమాట

**ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.యస్.,** 27-06-2009
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

కలియుగ ప్రత్యక్ష దైవంగా ప్రశస్తి వహించిన తిరుమల వేంకటేశ్వరుని భక్త బృందంలో ఒక్కొక్కరిది ఒక ప్రత్యేకత! ఆ ప్రత్యేకత ఆ యా భక్తవర్యులు శ్రీ స్వామివారిని ఆరాధించటంలో అనుసరించిన మార్గాల ద్వారా లోకానికి వెల్లడవుతూ వుంటుంది.

అలాంటి భక్తవరేణ్యులలో అగ్రగణ్యురాలు, శ్రీనివాసుని అంతరంగిక భక్తశిరోమణి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. పరమయోగిని (Woman Saint) గా, భక్త కవయిత్రిగా విలసిల్లిన ఈ సాహితీమూర్తి విశిష్టతను గుర్తించిన తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యం ఆమె పేరిట ఒక వాఙ్మయ పీఠాన్ని రెండేళ్లక్రిందట "శ్వేత" భవనంలో నెలకొల్పింది.

"తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు" - అనే పేరుతో ఏర్పడిన ఈ వాఙ్మయ పీఠం కేవలం రెండు సంవత్సరాల కాలపరిమితిలోనే ప్రశంసింపదగ్గ ప్రగతిని సాధించడం ముదావహమైన సంగతి!

ఈ వాఙ్మయ ప్రాజెక్టు భక్త కవయిత్రి 22 రచనలను ప్రచురించి వుండటం, అలాగే ఈ కవయిత్రి భక్తిరస భరిత గేయాలతో కూడిన 12 ఆడియో సి.డి.లను విడుదల చేయటం అభినందనీయం! అదే విధంగా ఈ మహాకవయిత్రి జయంతి, వర్ధంతి - ఉత్సవాలను, ఆంధ్రదేశంలోని తిరుపతి, హైదరాబాదు, విశాఖపట్నం, కాకినాడ, అనంతపురం, విజయవాడలాంటి అనేక ముఖ్య నగరాలలో సాహితీ సదస్సులు, సాంస్కృతిక కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించడం నిజంగా ఆహ్లాదకరమైన సమాచారం!

**అపూర్వ**మైన ఈ వాఙ్మయ ప్రగతికంతటికి మూల కారణమైన ఏకైక **వ్యక్తి తి.తి.దే.** శ్వేత సంస్థ సంచాలకులు ఈ వాఙ్మయ ప్రాజెక్టు డైరెక్టరు-అయిన

సుగృహీత నామధేయులు శ్రీ భూమన్ గారు. వారి కార్యదీక్షాదక్షతను నేను ఈ సందర్భంగా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఈ ప్రాజెక్టు మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ 192వ వర్ధంతి ఉత్సవ సందర్భంగా ఈ క్రింది మూడు విశిష్ట గ్రంథాలను వెలువరిస్తున్నది:-

1) **శివ నాటకము (యక్షగానము)** - మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ

2) **భక్త కవయిత్రి తరిగొండ వెంగమాంబ (బుఱ్ఱకథ)**- విద్వాన్ జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

3) **వెంగమ్మ (జీవిత సంగ్రహము)** - ఆంధ్ర శేషగిరిరావు

తరిగొండ వెంగమాంబ కృతులనన్నింటిని పరిష్కరించటంలో అనుభవం గడించిన ఈ వాఙ్మయ ప్రాజెక్టు పరిష్కర్త ఆచార్య కె.జె.కృష్ణమూర్తిగారు 73 ఏండ్లు మీరిన వయస్సులో అముద్రితమైన, అపూర్వమైన ఈ శివ నాటక యక్షగానాన్ని అనేక వ్రాతప్రతుల సాహాయ్యంతో ప్రశంసనీయమైన రీతిలో పరిష్కరించి, సాహితీ ప్రియులకు, భక్త జనావళికి అందజేస్తున్నందులకు చాలా సంతోషంగా వుంది.

అలభ్యమైన ఈ కవయిత్రి రచనలను కూడా ఇలాగే సేకరించి, ఆచార్య కె.జె.కృష్ణమూర్తిగారు చక్కగా పరిష్కరించి ప్రచురింపగలరని ఆశంసిస్తున్నాను.

మునుపటి పుస్తకాల మాదిరిగానే శివ నాటకం మొదలైన ఈ మూడు ప్రచురణలను సహృదయులైన పాఠకావళి సమాదరిస్తారని నా నమ్మకం.

ఈ రచనలు సహృదయులైన పాఠకుల హృదయాల్లో ఆనందాన్నీ, 'ఆనందనిలయుని' యెడల భక్తి ప్రపత్తులనూ పెంపొందింప గలవని మా ఆశయం.

29.6.09.

**ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.యస్.,**

# అభినందన

**"భూమన్"** 03-06-2009

సంచాలకులు,
తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు,
"శ్వేత" తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

ఆంధ్రవాఙ్మయం బహుముఖీనంగా సాగి విస్తరించిన ఒక క్షీరసాగరం. ఇందులో అనేకానేక అనర్ఘ రత్న మణిమాణిక్యాలు. వాటి నేర్చి కూర్చి ఒక పచ్చల మణిహారంలా సకల ప్రజలకు అందించాలనేది ఒక సత్సంకల్పం.

ఆ సంకల్పానుసారంగా తిరుమల తిరుపతి దేవస్థానముల ఆధ్వర్యంలో "శ్వేత"లో ఆవిర్భవించినదే "తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిశోధన ప్రాజెక్టు".

ఈ ప్రణాళికోద్దేశాల్లో మరుగున పడిన ఆ భక్త కవయిత్రి రచన లన్నింటినీ సేకరించి, పరిశోధించి, పరిష్కరించి ప్రజలకంద జేయటం మొదటిది. ఈ అంశం సర్వదిగ్విజయంగా సాగుతూ వుండడం ముదావహం!

ఆ ఆధ్యాత్మిక కవయిత్రిపై ఆ యా ప్రక్రియల్లో ఇతరులు రచించిన రచనా విశేషాలను ముద్రించి ప్రజల కందివ్వాలను కోవటం రెండవది.

ఆ ప్రయత్నంలో కొన్ని రచనలు అంటే 'నవల, జీవిత సంగ్రహం, నాటకం' - ఇత్యాదులు ఇదివరకే ప్రచురితమయ్యాయి. అలాంటి వాటిల్లో తెలుగునాట సామాన్యజనులకు కూడా అందుబాటులోని ప్రక్రియ "బుఱ్ఱకథ".

ఈ భక్తకవయిత్రి జీవితం "బుఱ్ఱకథ" రూపంలో వుంటే బాగుంటుందికదా! - అని సంకల్పించటం; దానిని ఆచరణలో పెట్టేందుకు శ్రీ జి. సుబ్రహ్మణ్యశాస్త్రి, (కార్యదర్శి, సూరన సారస్వత సంఘం, నంద్యాల) గారిని కోరడం; వారు మా కోరిక మేరకు ఆమె జీవితం ఆద్యంతాల్ని చక్కగా పరిశీలించి "బుఱ్ఱకథ"గా రాసియివ్వటం జరిగింది.

సరళంగా, సుబోధకంగా, ప్రదర్శనయోగ్యంగా మేమడిగిన వెంటనే ఈ "బుఱ్ఱకథ" రాసిచ్చిన విద్వాన్ జి. సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని మనసారా అభినందిస్తున్నాను.

**భూమన్**

## ఆమోదం

భాగవత కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ జీవితగాథ పవిత్రమైనది; పరమ రమణీయమైనది. ఇటీవలి కాలంలో ఈ ఇతివృత్తం ఆంధ్రసాహితీ ప్రపంచంలో ఆహ్లాదదాయకంగా అలరారుతూవుంది. అందువల్ల, రచయితలు కొందరు ఈ కవయిత్రి జీవితాన్ని ఉద్దేశించి చరిత్ర, నవల, నాటకం, హరికథ, నృత్యరూపకం - లాంటి ప్రక్రియల్లో రచనలను వెలయించియున్నారు. భవిష్యత్తులోనూ అలాంటి రచనలు మఱికొన్ని వెలువడే అవకాశం లేకపోలేదు.

అయితే, ఈ భక్త కవయిత్రి జీవనగాథను ఇంతవరకెవ్వరు "బుఱ్ఱకథ"గా వ్రాయలేదు. కాబట్టి, ఇది వెంగమాంబ జీవితంపై తెలుగులో వెలువడిన మొట్టమొదటి బుఱ్ఱకథ.

'బుఱ్ఱకథ' - అనేది తెలుగులో ఆ బాలగోపాలాన్ని అలరించే ప్రబోధాత్మకమయిన ప్రత్యేక ప్రక్రియ. ప్రధానంగా 'బుఱ్ఱ' - వాద్యం ఆధారంతో ప్రదర్శింపబడేది కనుక 'బుఱ్ఱకథ'గా వ్యవహరింపబడింది. ఇది ఆదిలో జానపద జీవనంలో మౌఖిక రూపేణ అవిరళ ప్రచారంలో ఉండి, క్రమేణ శిష్ట సాహితీ మందిరంలో సుప్రతిష్ఠితమై దృశ్య, శ్రవ్య - ఉభయ ప్రయోజనాత్మకంగా విలసిల్లుతున్నది!

తరిగొండ వెంగమాంబ జీవితాన్నీ, సాహిత్యాన్నీ విశ్వవ్యాప్తం చెయ్యడానికి బద్ధకంకణులైవున్న సుగృహీత నామధేయులు "శ్వేత" సంస్థ సంచాలకులు, సహృదయులు

శ్రీ 'భూమన్''గారి సమధిక ప్రోత్సాహం కారణంగా ఇప్పుడీ కృతి అక్షరాకృతి దాల్చింది!

రచయిత శ్రీయుతులు విద్వాన్ జి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సంచాలకుల సంకల్పాన్ని ఈరీతిగా సఫలం కావించడం మిగుల ముదావహంగా ఉంది.

బహుగ్రంథ రచయితయైన శ్రీశాస్త్రిగారు ఈ కవయిత్రీ మతల్లియొక్క దివ్యజీవితానికి సంబంధించిన అన్ని అంశాలను అత్యంత సహజంగా, చక్కగా ఇందులో పొదుకొల్పినారు. అంతేగాక, ఆ యా సన్నివేశాలకు అనుగుణంగా కవయిత్రి రచనల్లోని ముఖ్యాతిముఖ్య గేయాలను ఇందులో ఇమిడించి, ఈ రచన కొక నిండుదనాన్ని, కమనీయతను సమకూర్చియున్నారు.

"భక్త కవయిత్రి తరిగొండ వెంగమాంబ" - అనే ఈ కృతి సకల జనానందదాయి కాగలదు.

పరిష్కర్త

తిరుపతి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్ట్,

5.06.2009

తి.తి.దే. "శ్వేత"

## బుఱ్ఱకథ - కథాయిష్ఠు

ఇది నా స్వంత అభిప్రాయమే. "హరికథ, వీధి భాగవతము, పగటి వేషములు, వీధినాటకము, బుఱ్ఱకథ, బహుపాత్రాభి భాషణము" - ఇవన్నీ కూడా "ప్రాచీన యక్షగాన కళకు అవశేషాలని" మన ఆంధ్రదేశంలో.

'ఆంధ్రదేశంలో ననడం ఎందుకంటే - ఇంకా కన్నడదేశంలో యక్షగాన ప్రదర్శనలున్నందున. మన రాష్ట్రంలోనూ కూచిపూడివారి 'గిరిజా కళ్యాణము', 'శశిరేఖా పరిణయము' - ఇత్యాదులు యక్షగానాలు కావా? అంటే-

కావచ్చు; కానీ ఇవి కూచిపూడి నృత్యనాటికలు. నిజానికి యక్షగాన సాంప్రదాయం కూచిపూడి నుండే (ఆంధ్రము నుండేనని) నాయకరాజుల కాలంలో దక్షిణదేశంలోకి ప్రవేశించి, తన విశ్వరూపాన్ని ప్రదర్శించి, నాయకరాజుల క్షీణదశలో కర్ణాటకం చేరి అక్కడ సుస్థిరపడిందనే చెప్పాలి.

కర్ణాటకంనుండే యావద్దక్షిణ ప్రాంతాలకూ ప్రసరించిందనేది వాఙ్మయ చారిత్రకుల, నాట్యశాస్త్ర చరిత్ర పరిశోధకుల్లోని ఒక వర్గం వారి వాదన. కేరళ కథకళికీ, ఒరియా కథక్‌కీ, కూచిపూడి భాగవత ప్రదర్శనకూ (వేషధారణలో తప్ప) ఇతరేతర అభినయాంశాలలో పోలికలుండడం గమనించాలి.

నాయకరాజుల కాలంలో వెలసినన్ని యక్షగాన రచనలు - మరే కాలంలోనూ, మరే దాక్షిణాత్య భాషలోనూ వెలయలేదనే సత్యం కూడా ఈ కళ ఆంధ్రులదేనని వేనోళ్ల చాటుతుంది.

ఈ 'యక్షగానం'లో పాటలు, పద్యాలు, పదాలు, దరువులు, ఏలలు, వచనం, అభినయం, నృత్యం, ప్రవేశనిష్క్రమణలు - అన్నీ ప్రదర్శనోపయోగిగా వుంటాయి.

ఒక్కొక్కరు ఒక్కొక్క పాత్రను ఆవేశింప జేసికొని తమతమ హావభావ ప్రదర్శనలను, సంగీత, నృత్యకళా చాతుర్యాన్ని ప్రదర్శిస్తారిందులో.

కాలక్రమంలో ఈ యక్షగానం ఆంధ్రదేశంలో అదృశ్యమైపోయింది. దీనికి అతి సన్నిహితరూపంగా కూచిపూడి భాగవతం- (భాగవతులూ) మిగిలింది.

యక్షగాన రీతులనే సొంతంచేసికొని అందలి బహుపాత్రలనూ తానొక్కడే అభినయిస్తూ "హరికథ"గా తరువాతి పరిణామంలో శేషిస్తే, అందులోనీ దరువునీ, హాస్యాన్నీ, వచనాన్నీ, స్వంతం చేసుకొని గ్రామీణులను సైతం అలరించే రీతిలో "హరికథకు" సామ్యంగా పరిణమించిన రూపమే "బుఱ్ఱకథ".

హరికథకుడు తానొక్కడే అన్ని పాత్రలనూ అభినయిస్తాడు. బుఱ్ఱకథకుడూ ఇదే పనే చేస్తాడు.

హరికథకు వాయులీన, మృదంగాలు వంతగా ఉపకరిస్తాయి. బుఱ్ఱకథలో వంతలిద్దరూ వుండి, హాస్యాన్నీ, ఆవేశాలనీ పండిస్తారు. హరికథ "క్లాసికల్"; బుఱ్ఱకథ - "ఫోక్‌లోర్" ఇదే తేడా.

ఆ విధంగా హరికథలూ, బుఱ్ఱకథలూ కూడా ఆంధ్రదేశంలో సరిసమానంగానే ఆదరింపబడుతూవుంటాయి, నేటికీ.

ఈ నేపథ్యంలో తిరుమల తిరుపతి దేవస్థానము తరపున మా గురువర్యులు డా॥ కె.జె. కృష్ణమూర్తిగారి ఆదేశానుసారంగా నాకున్న

పురానుభవం రీత్యా శ్రీతిరుమలేశునికీ - తరిగొండ లక్ష్మీనృసింహునకూ అభేదభక్తి భావాన్ని పాటించి, గొప్పభక్తురాలిగా, ఆధ్యాత్మిక కవయిత్రిగా మనుగడ సాగించి, తరించిన తరిగొండ వెంగమాంబ జీవితాన్ని - ఈ "బుఱ్ఱకథ"ను - నాలుగు భాగాలుగా కూర్చటం జరిగింది.

బహుశా ఈ భక్త కవయిత్రిపై తొలి బుఱ్ఱకథ యిది. ఇది తి.తి.దే. 'శ్వేత' సంచాలకులు శ్రీ భూమన్ (శ్రీ బి.యస్.రెడ్డి) గారి సంపాదకత్వంలో వెల్వడడం ముదావహం! ఇలాంటి విలక్షణ రచనను ప్రజలకందించాలనిన సత్సంకల్పంతో నన్ను ప్రోత్సహించిన శ్రీ భూమన్ గారికి మనసా, వాచా ప్రణామ పరశ్శతమ్!

అందంగా ముద్రించిన తి.తి.దే. ముద్రణాలయం వారికి శతసహస్ర ధన్యవాదములు.

నంద్యాల — వినయాంజలి పూర్వకంగా

24-1-2008 — జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

# ప్రణామ సమర్పణం

ఈ రచనాభాగ్యం ఆ భక్తకవయిత్రి తరిగొండ వెంగమాంబ మహత్తర జీవిత మందించినదే. ఆ తల్లికి మనసా వందన శతమ్.

కథకు ఉపకరించినవి రెండు ఉద్గ్రంథములు. ఒకటి "శ్రీ తరిగొండ వెంగమాంబ - జీవితము - సాహిత్యము" పైని పరిశోధన గ్రంథము. రెండవది ఆతల్లి "ఆశు కీర్తనలు - వేదాంత ద్విపదలు - యక్షగాన పదాలు - మంగళహారతి పాటలు" సంకలనం కావింపబడిన అపూర్వ గ్రంథము. ఈ రెండు గ్రంథములలోనూ మొదటిదాని రచయిత; రెండవదాని సంపాదక మహాశయులు అస్మద్గురువర్యులు శ్రీయుత కె.జె.కృష్ణమూర్తిగారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు; ప్రణామములు.

'నేను వ్రాశాను' అంటే 'అహంకారం'; 'నేనే వ్రాశానిది' అంటే 'దురహంకారం'; కనుక నేను వ్రాయలేదని వినయ విజ్ఞాపనము. కేవలం నేనొక 'కరణాని'; 'నిమిత్త మాత్రుడను'. కర్తా-కారయితా, ప్రేరయితా అంతా ఆ ఏడుకొండల వేంకటేశ్వరుడే! ఆ మూడునామాల స్వామికి, నన్ను ప్రేరేపించి నాతో ఈ రచన చేయింపించుకొనిన ఆ ఆపదలమ్రొక్కుల వాడికి శిరసా శతసహస్ర ప్రణామాలు!

"నాహం కర్తా! నాహం భర్తా! - సర్వం శ్రీ శ్రీనివాసమయం జగత్"

24-01-2008. "రచయిత"

# 1వ భాగము

[ రంగం మీదకు వంతపాటగాళ్లు (ఒకరు వంత, ఒకరు హాస్యం - వీరిద్దరూ వీలునుబట్టి తమతమ పాత్రలను మార్చుకోవచ్చు). దరువు వాయిస్తూ పరుగున రాగా, పూర్తిగా కథక వేషధారియై కథకుడు ప్రవేశిస్తాడు ].

కథకుడు:- ఆగండి! ఆగండి! తమ్ముళ్లారా! ఆగండాగండి! (రంగం మధ్యకు వస్తాడు. అతని కిరువైపులా 'వంతలు' నిలబడి)

**1వ వంత**:-అయ్యా! మహాప్రభో! ఏల ఈవేళ పరంపరగా వచ్చే పద్ధతిని అడ్డుకొంటివి?

**2వ వంత**:-అవును మహానుభావా! ఉరుము ఉరుమనిదే వాన సంగీతం వాలదు కదా? దరువు లేకుండా కథకు మెరుపు వుండదు కదా! ఎందుకయ్యా ఆగమంటివీ? (దరువు వాయిస్తాడు).

**కథకుడు**:-తప్పు తమ్ముళ్లారా! పెద్దతప్పు!

**ఇద్దరూ**:- అదే! ఎందుకంటా? (మళ్లీ దరువు)

**కథకుడు**:-తమ్ముళ్లారా!

**ఇద్దరూ**:- (దరువేస్తూ) ఆఁ!

**కథకుడు**:-నాయనలారా!

**ఇద్దరూ**:- (దరువేస్తూ) ఆఁ ఆఁ చెప్పుమయ్యా! చెప్పుము!

**కథకుడు**:-తమ్ముళ్లారా! ఈ రోజు మనము చెప్పబోయే కథ అలాంటి ఇలాంటి అల్లాటప్పా కథ కాదు.

**ఇద్దరూ:-** మరేఁ!

**కథకుడు:-** ఏ రాజకీయమో, ఏ చారిత్రకమో, ఏ సామాజికమో, రంగు పులుముకున్న రసికుల కథా కాదు.

**ఇద్దరూ:-** మరేఁ!

కథకుఁడు:-ప్రచార నిమిత్తమో, విచారనిమిత్తమో వాచాలత్వం ప్రదర్శించే వాయనాల కథా కాదు.

**1వ వంత:-** అబ్బా! ఉత్తకంట కలిగించక ఉన్నదదేందో చెప్పి, పుణ్యం కట్టుకో మహానుభావా!

**2వ వంత:-** కట్టుకో మహానుభావా! (దరువు)

(హాస్యం)

**కథకుడు:-** ఉత్తకంటా, కంటిమంటా కాదు నాయనలారా! ఉత్కంఠ అనవలె.

**ఇద్దరూ:-** సరేలే! ఆ కంఠేకానీ, మాకెందుకంటా ఆ కంఠ శోషా? అదేందో తొరగా సెప్పి పుణ్యం కట్టుకో సామీ!

**కథకుడు:-** నాయనలారా! ఇప్పుడు మనం చెప్పబోయే బుఱ్ఱ కథ"శ్రీమత్తిరుమల వేంకటేశ్వర స్వామి పాదారవింద మకరంద బిందు బృందసందోహ సదాస్వాదనా నంద భక్తమిళిందం.." (రాగం తీసి చెబుతాడు)

**2వవంత:-** అగాగు సామీ! అగు ఏందదీ... వర్ణిస్తుండవా? మమ్మల్ని ఏకంగా తిట్టిపోస్తుండవా ఏందీ? ఏందో దబ్బ దబ దబా అరిస్తివీ?.... (రాగంతీస్తూ)

**కథకుడు:-** (నవ్వుతూ) నాయనలారా!

**వంతలు**:- (దరువేసి) అఁ.

**కథకుడు**:-తమ్ములారా!

**వంతలు**:- (దరువేసి) అఁ!

**కథకుడు**:-ఆ ఏడుకొండల వానిని ఆ మలయప్పస్వామిని ఆ శేషాచలవాసుని ఆ శ్రీనివాసుని పేరు తలచినంత మాత్రాననే ఎవరికైనా ఎందుకో అలా కవితామృతధార పొంగిపొరలుతుందంతే! అంతే తప్ప, అది దూషణ కాదు నాయనా!

**వంతలు**:- అహఁ!

**కథకుడు**:- సరే పోనిండు! ఆ పదబంధాలను ప్రక్కన పెట్టుదాము; ఆ ఏడుకొండలవానినే త్రికరణశుద్ధిగా నమ్మి భజించి తరించిన మహాభక్త కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ దివ్యచరిత్రను....

**వంత (1)**:-ఏమిటీ! ఆహాఁ! ఆ గొప్పతల్లి చరిత్రే?
**వంత (2)**:-ఆ మహాభక్తురాలి చరిత్రే?

**కథకుడు**:-అవును నాయనలారా! ఆ భక్తురాలి దివ్యగాథనే మనం ఈనాడు చెప్పబోతున్నాము.

**వంత(1)**:-మహాప్రభో! ఏ పాత తాటాకుల కవిలెకట్టలో నుండో దులిపి పట్టుకొని వచ్చినారా ఈ కతను?

**వంత(2)**:-ఏ పాత్తరం కవో, పంతులో రాసుంటే నకలుపెట్టి కలకలలాడ చేసినారా ఈ కతను?

**కథకుడు**:- కాదు నాయనలారా! మన భాగ్యవశాన తిరుమల తిరుపతి దేవస్థానం "శ్వేత" సంస్థయందలి .... మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయపీఠంవారి ఆదేశాన .... మన రాయలసీమకే చెందిన కర్నూలుజిల్లా .... నవనందుల నిలయమైన నంద్యాల పురవాసుడు .... సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్త .... సుకవీ, పండితుడూ అయిన - గొట్టిముక్కల వంశ క్షీర వారాశి రాకా శశాంకుండయిన సుబ్రహ్మణ్యశాస్త్రి నామధేయుండైన పుణ్యమూర్తి రచించిన దివ్యగాథ- (-నుండి-వరకు రాగంతీసి చదవాలి)
---- కనుకే ---ముందే దరువు వలదన్నాను.

**వంతలు**:- (లెంపలు వేసుకుంటూ) తప్పయిపోయింది స్వామీ! మరయితే ఏమి చేయవలె?

**కథకుడు**:-నాయనలారా!

**వంతలు**:- అయ్యా!

**కథకుడు**:-మీరిద్దరూ నాకిరువైపులా వరుసగా నిలవండి!

**వంతలు**:- అట్లేనయ్యా!

**కథకుడు**:-మన కథ ఏ విఘ్నాలూ లేకుండా, ఏ ఆటంకాలూ లేకుండా, గంగాజలధారలా సునాయాసంగా సాఫీగా సాగిపోవలెనంటూ ముందు ఆ విఘ్నేశ్వరుని ప్రార్థింతాము.

**వంతలు**:- బలేబలే! నిజమంతే కాదూ! అయితే ప్రార్థింతాము. (ముగ్గురూ చేతులు జోడించి నిలిచి)

**(దరువు - ఆటతాళం)**

(కథకుడు పలికిన ప్రతిచరణాన్నీ వంతలు మళ్లీ పలుకుతూంటారు)

**వల్లవి:-** "గణనాయకా! శరణు - గణనాయకా! శరణు
గణనాయకా! శరణు! గణనాయకా!

**1వ చరణం:-**శ్రీ శివ వరపుత్ర! చిరతర ఘనచిత్ర్ప కాశ! మమ్మేలు
- శ్రీ గణనాయకా!

**2వ చరణం:-**భవరోగ సంహార! భక్త చిత్తవిహార!
కవిజన మందార! గణనాయకా!

**3వచరణం:-**అలరార నినునమ్మి - నటువంటి మాపాల
కలిగియుండుము నీవు - గణనాయకా!

**4వచరణం:-**తలగక విఘ్న కా - రుల ద్రుంచి బ్రహ్మ సత్కళలో
నన్నుంచు - శ్రీ గణనాయకా!

**5వచరణం:-**ఆరూఢి తరిగొండ - హరికి సోదరియైన గౌరి
కుమార! శ్రీ - గణనాయకా!

**వంతలు:-** (దీర్ఘంగా రాగం తీస్తూ) శ్రీ...గణ... నాయకా!...
(దరువు వాయిస్తారు)

**కథకుడు:-**తమ్ములారా!

**వంతలు:-** అయ్యా!

**కథకుడు:-**సిద్ధమా?

**వంతలు:-** మేము సిద్ధమే మహానుభావా!
(ఇద్దరూ చెరొక వైపు నిలుస్తారు)

2

**కథ కుడు:**- [ చేతి తంబుర మీటుతూ, చిరుతలు (తాళములు) వాయిస్తూ - అభినయ పూర్వకముగా ]

వినరా తమ్ముడ! తెల్గు సోదరా!
దివ్యగాథ నేడూ! .... ॥తందాన తాన॥

వీనులవిందౌ వింత మహిమలా
దివ్య చరిత నేడూ... ॥తందాన తాన॥

ఏడుకొండలా వేంకటేశునీ
భక్తురాలి కథనూ.... ॥తందాన తాన॥

వేంకటేశు దయను కవితలల్లినా
కయిత తల్లి కథనూ... ॥తందాన తాన॥

తెలుగు కయితలా గొప్ప చరితలో
ధీరురాలి కథనూ... ॥తందాన తాన॥

తరిగొండలో పుట్టి - తిరుమలాగిరి మెట్టి
తరియించినట్టి - శ్రీవెంగమాంబ కథనూ ॥తందాన తాన॥

**వంతలు:**- "తధికిట తధికిట తధికిటతోం ॥

**వంత(1):**- అయ్యా! అయితే ఆ గొప్పతల్లి-
**వంత(2):**- ఏడుకొండలవాని భక్తురాలయిన గొప్పతల్లి....

**వంత(1):**- తరిగొండలో పుట్టీ అంటున్నారు?
**వంత(2):**- తిరుమలలో మెట్టీ అంటున్నారు?

**కథ కుడు:**-నాయనలారా! అసలా భక్తకవయిత్రీమతల్లి ఎక్కడ పుట్టిందో ఎక్కడకు చేరిందో - అదంతా ఒక పెద్దకథ నాయనలారా!

**వంత(1):-** (దరువు వాయిస్తూ) తరికిట తరికిట తరికిట ఝుం
**వంత(2):-** అయితే ఆమె పుట్టు పూర్వోత్తరాలూ ఇతరత్రా అన్నీనూ..

**వంతలు:-** విశదంగా చెప్పేదురు గాక! అని మా.... మనవీ... (చివరి పదాలు రాగాలు తీసి పలుకుతారు)

(దరువు మొదలు పెడుతారు)

**కథకుడు:-**(తాళాలు వాయిస్తూ - తంబుర మీటుతూ - గొంతు సవరించుకొని)
శ్రీలు పొంగారేటి - తెలుగుసీమ మనది ॥తాన॥
పాడిపంటలతోడ - పాల్గారు నట్టీది ॥తాన॥
ముక్కారు పంటలూ - పండు బంగరునేల ॥తాన॥
మూడు కాలాలూ - గతులు తప్పనినేల ॥తాన॥
అన్నదమ్ములవోలె - జగమంత ఒకటిగా ॥తాన॥
కన్నబిడ్డలవోలె - కలిసి మెలసుండేటి
కరుణాకరుల నేల - కల్మిలా భూమంటు
నిత్యమై - సత్యమై - తుష్టి నిండిన నేల ॥తాన॥

(బాగా గొంతెత్తి)
జగతిలో ఇల్లాంటి దెక్కడా లేదురా!

**వంతలు:-** "లేదురా!"
మన తెల్గు భూమిరా! - మనకల్మి పేటిరా!

**వంతలు:-** "పేటిరా!"
మన తుష్టి మన పుష్టి మన కిష్టమైనట్టి
మన పండుగల బట్టి - సాగుతుంటిమిరా!॥తరికిట ఝుం॥

(ఒక్కసారిగా కథకుడు ఆగి ఆకాశం వైపు చూస్తూ మౌనం)

**వంత:-(1):**-అదేమిటయ్యా! ఉన్నట్టుండి అంత సంతోషాన్నీ చటుక్కున వదిలేసి.

**వంత(2):**- "వదిలేసి" (దరువు)

**వంత(1):**- మొగమింత చిన్న బుచ్చుకున్నా వెందుకయ్యా?

**వంత(2):**- ఎందుకయ్యా? (రాగంతో దరువు)

**కథకుడు:**-(విచారంగా) ఏమి చెప్పమందురు తమ్ములారా? విధి చెయిదము లెంత వింత విలాసములో ఏమని చెప్పెదను? నాయనలారా!

**వంత(1):**- ఏమా విధి చేతలు?

**వంత(2):**- ఏమా విధాత వ్రాతలు?

**కథకుడు:**-"వినుడి తమ్ములార! తెల్గు సోదరులార!
కాలమహిమ కతనూ ॥తందాన॥

కలడొక్క కవివరుడు - తరిగొండ గ్రామాన
కృష్ణ కవిపేరా - కానాల కృష్ణకవిపేరా ॥తందాన॥

తరిగొండ గ్రామాన - కలిగి వుండిన దెంతొ
దాని తోడనె బ్రతుకు - కదిలించెడీ వాడు ॥తందాన॥

చెరువు క్రిందీ పొలమూ - వేట నిండుగ ధాన్య
మప్పు సప్పులు లేక - సాగించెడీ వాడు" ॥తందాన॥

**వంత(1):**- అంతేనా! మరేమైనా వున్నదా?

**వంత(2):**- ఉన్నదా?! (రాగం - దరువు)

**కథ కుడు:**-కష్టాలు కన్నీళ్లు లెక్క సేయనివాడు
నిష్ఠలూ నియమాల బ్రతుకు గడిపేవాడు
దేవుణ్ణి ధ్యానించునట్టి జీవుండూ....
పదం పద్దెం కట్టి కీర్తించు కవివరుడు"
॥తందాన॥

**వంత(1):**- అయితే ఏమిటంటా?
**వంత(2):**-"టా...?"

**కథ కుడు:**-తమ్ముళ్లారా! అంతోయింతో పాడీపంటా వుండీ; అనుకూలవతి అయిన ఇల్లాలూ వుండీ, తిండికీ తిప్పలకీ గూడుకూ లోటు లేకుండా వుండీ...

**వంత(1):**- అన్నీ....వుండీ....(రాగం-దరువు)
**వంత(2):**- వుండీ...వుండీ...తరువాతేమండీ?

**కథ కుడు:**-(రాగం ఆలపిస్తూ; విచారంగా)
"ఐశ్వర్యమున్నా - అన్నీ వున్నా
అనుకూలవతి అయిన - ఇల్లాలున్నా
కూనలేని యిల్లు - కాన గదరా! నాన్న!
శిశువు లేని యిల్లు - విసువు కదరా! అన్న!"

**ఇద్దరువంతలు:**-(విచారంగా) "తందానా... తానతందనా- తాన-తంద నానా.."

**కథ కుడు:**-"కిలకిలా నవ్వులా - కిచకిచా కేకలా
పసిపాప లేనిల్లు - బోసిపోవునురా! ॥తందానా॥

కలకలాలాడాలి - ఇల్లంటే
మిలమిలా మెరవాలి - పాపల్లో ॥తందానా॥

**కథకుడు:**-"కృష్ణకవి దంపతులు - సంతులేనీ చింత
వంతల్లొ ఎన్నాళ్లొ - ఏగేరు...
వెంకన్నకూ ముడుపు కట్టేరు... ॥తందానా॥

**వంత(1):**- ముడుపు కట్టీ మొక్కు పెట్టీ అట్టానే వుండి
పోయినారా.. తందానా? (దరువు)

**వంత(2):**- ముడుపు కట్టిన సంగతి మరచిపోయి కాలం అట్టే
ఎళ్ల దీసారా...తందానా? (దరువు)

**కథకుడు (వచనం)** మీరు వట్టి చవట దద్దమ్మలు సోదరా! కానాల కృష్ణ
కవీ అంటేనే ఆ ప్రాంతంలో అందరికీ మంచికీ
చెడుకూ వందనాలందుకునే నందవరీక
భూబృందారకుడు - ముడుపు కట్టి మరచిపోయేనా?

**వంత(1):**- అయితే తరువాత గిరవాత ఏం జరిగిందో?...
**వంత(2):**- చెప్పండీ..మరీ!..తరికిట తరికిట తరికిట తధిగిణతోం॥

**కథకుడు:**-(రాగం ఆలపిస్తూ) ఆ....తందానో..తానతందానో తాన
తందనానా..
"ఊరిలో జనమంత - యాత్ర కదిలేరా!"

**వంతలు:**- "భళాభళి!"
"ముడుపుల హుండీల్ - ఉడుపుల మూటలు
నెత్తి కెత్తినరురా!" ॥భళాభళి!॥

గోవిందా! గోవిందా!! హరి గోవిందా!!!
వెంకన్నకంటూ ॥భళాభళి!॥

మంద గొంతుకలతొ - ముందుకు నడిచీ
వందమందిగా వడివడి కదిలీ ॥భళాభళి!॥

తిరుమల తిరుపతి దారిని బట్టీ
తిరముగ తిన్నగ కదలినారురా! ॥భళాభళి!॥

**వంత(1):-** కదలినారురా - సోదరా!
**వంత(2):-** కదలిపోతున్నారురా సోదరా! ॥తధిగిణ తధిగిణథా॥

**కథ కుడు:-**అప్పుడు...

**ఇద్దరూ:-** అప్పుడు?

**కథ కుడు:-**ఆ భక్త బృందం గోవిందనామాలు పలుకుతూ,
తిరుపతి మార్గాన నడిచి వెళుతూన్నపుడు..

**వంత(1):-** నడచి వెళుతూన్నపుడూ.. (రాగం)

**కథ కుడు:-**సంతులేని చింతతో కుమిలిపోతూన్న అంతరంగంతో
కృష్ణకవి ఆ మూడు నామాల వేంకటేశ్వరుని తలచి
తలచి భక్తి ఆవేశాలతో..

**వంత(2):-**ఏం చేసినాడయ్యా? ॥తందనతాన -తన
తందనానా!''

**కథ కుడు:-**ఏం చేసినాడంటే.. ఆస్వామి వున్న దిశకే చూస్తూ
ఇలా ప్రార్థిస్తూ కదిలినాడయ్యా!

**వంత(1):-** ఎలా కదలినాడయ్యా? (దరువు)

**కథ కుడు:-**"శ్రీనివాసస్వామి! - సెలవీయవయ్యా!
నానా ప్రకారముల - మము గావవయ్యా!

నీవు సంకల్పించి నిలుపుచుండినచోట
నేవసింపగ వత్తు నిష్కరుష గనుకా
దేవ! నాసంకల్పమే విధంబుగ సాగు
గోవింద! శ్రీవాస! శ్రీవేంకటేశ!
శ్రీనివాసస్వామి! సెలవీయవయ్యా!
ఒకపండు కాయంగ వరమీయవయ్యా!
నానా ప్రకారముల నను గావవయ్యా!"

**వంతలు**:- "శ్రీనివాసస్వామి! - సెలవీయవయ్యా!"

**కథకుడు**:-అంటూ, భక్తిరసభావ బంధురంగా పాటపాడుతూ నడుస్తూంటే - ఆ మహానుభావుని... ఆ కవివరేణ్యుని గళమాధుర్యానికీ - పాటలోని ఆవేదనకూ - ఆ వేదన నినదించిన ఆయన స్వరసంగతికీ తోడు నడుస్తూన్న భక్తబృందమంతా కూడా ...పరవశించిపోయి... ఒక్కపెట్టున "గోవిందా! గోవిందా!!" అంటూ గోవిందనామ జపం చేసింది.

**వంతలు**:- "గోవిందా! గోవిందా!!"

**కథకుడు**:-తమ్ముళ్లారా! గోవిందా! - అంటూ మనము వెళ్లుట లేదు కదా నాయనా!

**వంతలు**:- అవును కదా!

**కథకుడు**:-మరి ఆ గోవింద నామస్మరణ మేమిటి నాయనా?

**వంత(1)**:- అవునూ...ఏమిటీ!

**వంత(2)**:- తధిగిణ తధిగిణ తధిగిణతోం...అది. తరువాత ఏమయ్యిందో సెలవివ్వండీ? (దరువు)

**కథకుడు:-** (రాగం ఆలపిస్తూ...తాళాలు వాయిస్తూ)
"బత్తులందరు కూడ - చిత్తమందున స్వామి
చిత్తరమ్మునె నిల్పి - సాగినారూ ముందు

**వంత(1):-** "సాగినారులె ముందు"

**కథకుడు:-**అలసి సొలసిన వేళ - అలిపిరీ చేరీ
ఆపైన తలయేరు - గుండునూ తాకీ...

**వంత(2):-** "గుండునూ తాకీ.."

**కథకుడు:-**పాదరక్షల మండ - పాన - చెప్పులను విడచి
కాసేపు తమ మేని - శ్రమను తొలగించీ

**వంత(1)** "శ్రమను తొలగించీ.."

**కథకుడు:-**మోకాళ్ల పర్వతము - మోపి చేతుల, నెక్కి
గోవింద! గోవింద!- అనుచు గసపెట్టీ

**వంత(2):-** "గసవెట్టీ"..

**కథకుడు:-** కనినారు ముందరా - కమనీయ గోపురము
కాంతులీనే స్వామి - రమణీయ మందిరము
చూడగానే మేను - పులకించెరా!
అడుగేసి సాగిలా - పడినారురా!

**వంత(1):-** అరరరరె! అంటే సామిదర్శనం అయిపోయినట్టేనా?

**వంత(2):-** మొక్కుబడీ అయిపోయినట్టేనా?

**కథకుడు:-**కాదు నాయనలారా! ఏడుకొండలూ ఎక్కీఎక్కీ వచ్చి
స్వామి మందిరము గోపురము చూడగానే భక్తులు

పరవశించి శ్రమనంతా మరచి స్వామినే చూచినంత నంబరాన సాగిలబడి తమ భక్తి ప్రపత్తులు చాటుకున్నారు నాయనా!

**వంత(1):-** ఆఁ! ఎవరూ?

**కథకుడు:-**మన కానాలకృష్ణకవి నాయనా!

**వంత(2):-** ఆఁ... మన కానాల కృష్ణకవి? ఏం చేసినాడయ్యా?

**కథకుడు:-** ఆ ఏడుకొండలవాని దివ్యమందిరాన్ని ... ఆ ఆనంద నిలయాన్ని చూచి పరవశించిపోతూ....

" అదుగో......
అదుగో!...అల్లదిగో! శ్రీహరివాసమూ...
పదివేల శేషుల పడగలమయము ॥

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల మునులకు
అదె చూడుడదె మ్రొక్కు డానందమయము ॥

కైవల్య పదము వేంకట నగ మదిగో!
శ్రీవేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపద రూప మదిగో!
పావనములకెల్ల పావనమయము ॥"

అంటూ తనను తాను మరచిపోయి, ఆ పదకవితా పితామహుడైన అన్నమయ్య పదాన్ని ఆలాపిస్తూ అలా అలా ముందుకు కదలిపోతూంటే -

**వంత(1):-** తధిగిణ తధిగిణ తధిగిణ థోం...పోతూ వుంటే...

**వంత(2)**:- ఏమయిందయ్యా? (రాగంతీస్తూ)

**కథ కుడు**:-"కళ్లెదుట కల్యాణ కట్టనే చూచాడు"
(వంతలు - "తందాన తాన" అంటూంటారు)

"అర్ధాంగి మంగాంబతో కూడ వెళ్లాడు ॥తందాన తాన॥

ఏపుగా మోపుగా మూపుగా కట్టీన
తలనిండు నీలాలు ఇచ్చారు ॥తందాన తాన॥

పుష్కరిణిలో మున్గి - పుష్కరిణిలో మున్గి
గోవింద! గోవింద!! అన్నారు...
ఘోరపాపాలన్ని ముంచారు ॥తందాన తాన॥

కత్తిపట్టిన వాని కత్తిపట్టినవాని

ముందుకూచున్నారు - ఇద్దరూ ॥తందాన తాన॥

**వంతలు**:- "తధిగిణ తధిగిణ థాథాథా"

**వంత(1)**:-అయ్యా! తరువాతేమయిందో.....
**వంత(2)**:- ఆళ్లిద్దరూ ఏంజేశారో సావదానంగా చెప్పవయ్యా! ...ఆ...ఆ.

**కథ కుడు**:-నాయనలారా!

**వంత(1)**:- ఆఁ (దరువు)

**కథ కుడు**:-తమ్ములారా!

**వంత(2)**:- ఆఁ (దరువు)

**కథ కుడు**:-కళ్యాణకట్టలో తలనీలాలు ఇచ్చేసి, స్వామివారి పుష్కరిణిలో స్నానం కావించి నేరుగా వెళ్లి వరాహస్వామిని దర్శించుకున్నారు.

**వంత(1):-** ఆహా! తర్వాత?

**కథకుడు:-** తండోపతండాలుగా స్వామి దర్శనం కోసం నిలబడున్న గుంపు వరుసలో కానాల కృష్ణయ్య, అతని భార్య మంగమాంబా కూడా నిలుచున్నారు.

**వంత(2):-** ఓస్! అంతేనా? ఇంతసేపు మేము నిలవలేదా ఏం?

**కథకుడు:-** తప్పు నాయనా! ఈ నిలవడం మనకోసం! ఆ నిలవడం స్వామి వారి దివ్యమంగళ విగ్రహ దర్శనం కోసం!

**వంత(2):-** (చెంపలేసుకుంటూ) తప్పు!తప్పు! వరే! చిన్నాడా!

**వంత(1):-** ఆఁ పెద్దోడా!

**వంత(2):-** నువ్వూ లెంపలేసుకో! సామికి కోపం వచ్చినా? ఈ దప్పును కాదని మనల్నే వాయిస్తాడు. ఏసుకో! ఏసుకో!

**కథకుడు:-** నాయనలారా! కొంచెము సేపటికి ఆ దంపతు లిద్దరూ ఆ ఏడు కొండలవాని యెదుట నిలబడినారు. ఆ స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని నానా పుష్పమాలికాలంకార శోభితుడైన ఆ ఆనందమూర్తిని దర్శించుకోగానే కృష్ణయ్య తనను తాను మరచేపోయినాడు. గొంతెత్తి...

**వంత(1):-** ఆఁ గొంతెత్తి..?

**కథకుడు:-**(ఆలాపన)

"ఏడుకొండల సామి! - నీకు దండాలు ॥తానతందానె॥
గోడు తీర్చేసామి! - కోటి దండాలు "
వాడ వదిలొచ్చాము - ఈడ నిను చూచాము "

వీడు వాడని భేదమెంచ - నట్టీ సామి!"
మా గోడు వినవయ్య! - మాత లచ్చిమగండ!"
మాకడుపు పండగ - దయచూడుమయ్యా! ॥ఏడు॥"

**వంత(2)**:- 'తానతానతందాన తానథానా!'

**కథకుడు**:-అంటూ అద్భుతంగా పాటపాడినాడు

**వంత(1)**:- మరి ఆ తల్లి మంగమాంబమ్మ ఏమి చేసిందంటా?

**కథకుడు**:-ఏమీ చెయ్యలేక పోయిందయ్యా! రెప్పవాల్చకుండా ఆ స్వామి నిలువెత్తు అందాలరూపాన్నే చూస్తూ అట్లానే నిలుచుండి పోయి... మనసులో.. "స్వామీ! నా కడుపున ఒకకాయ కాయనివ్వు! నీపేరే పెట్టుకుంటాము" అని వరం కోరుకుందంతే!

**వంత(2)**:- మంచివరమే కోరిందయ్యా! సంతులే నిల్లు చింతల వల్లని కదా పెద్దోళ్ల సుద్ది!

**వంత(1)**:- ఆ చింత తీరాలంటే సంతు ఉండాల్సిందే కదా!

**వంత(2)**:- ఔనుకనకే! ఆ తల్లి మంచి కోరికే కోరినాది సామిని!

**కథకుడు**:-నాయనలారా! వాళ్ళు యాత్ర చేసిందే అందుకు కదా! యాత్ర ముగించుకొని కానాల కృష్ణకవీ, ఆయన భార్య మంగమాంబా తరిగొండ చేరినారు.

**వంత(1)**:- తధిగిణ తధిగిణ తధిగిణతోం..అంతా బాగానే వుంది కానీ సామీ! కవిగారుండేది తరిగొండలో నవుతే ఆయనింటిపేరు కానాల ఏంది సామే?... (రాగం).

**వంత(2):-** ఏమా కథా కమామిషూ మాకు తెల్పవయ్యా?..
(రాగం-దరువు)

**కథకుడు:-** నాయనలారా! వినండి! మరి! (తాళాలూ- తంబురా మీటి)

"వినరా!సోదర! తెలుగు తమ్ముడా!
వింతగాథ ఒకటీ... ॥తందాన॥

వీనుల విందై - సోనల పొందై
వెలుగు చిత్రకథనూ.... ॥తందాన॥
అనాడు ఆంధ్రమున - అణగి వుండిన ఇరవు ॥తందాన॥
బళ్లారి మండలమ్మా - ॥తందాన॥
ఆ మండలములో - అలరారుచుండెనూ॥తందాన॥
రాయదుర్గము నాడూ... ॥తందాన॥
॥తత్తధికిట తధికిట తోం॥
రాయదుర్గమే ఏలెరా! - సై
అచ్యుత గోత్రోద్భవుడురా! - సై
రామనాయడను - ఏకిలి దొరా
పాళెగాడై దిటవునా.. సై
పాడిపంటల తోడ - పసుల సంపద తోడ
జనుల కండగ వుండి.... ॥సైసై..సైసై॥
అమ్మతో, ఆలితో
తమ్ముడై్రమతో
కడుపులోన చల్ల - కదల కుండగనుండ"...
॥తధిగిణ తధిగిణతోం॥

**వచనం:-** ఏం జరిగిందయ్యా అంటే...

**వంత(1)**:- (దరువేసి) ఏం జరిగిందో చెప్పండి మహాప్రభో!-

**వంత(2)**:- (రాగం) మహా...ప్రభో!...

**కథకుడు**:-(విషాదంగా)

"సవ్వడీ లేకుండ - పిడుగు రాలిన తీరు
ఎరుకలే లేకుండ - ఏరుపొంగిన తీరు
ఏమాయె-ఏమొచ్చె-ఏ శాపమో - కాని.

**వంతలు**:- తందానా..తానతందనా - తాన...తందనానా - (విషాదంగా)

**కథకుడు**:-"ఆ దేవుడికి కోప మెందు కొచ్చెనొ కాని
తొలకరికి చినుకైన - తొలకకుండా పోయె
వాన కొరకు కూడ -చినుకు రాలక పోయే"

**వంతలు**:- తందాన....తాన తందనా...తాన తందనానా......

**కథకుడు**:-"ఘోరమైన కరవు - గోడుకొట్టెను జనుల ॥తం॥
కూడు నీళ్లులేక - కుళ్లిపోయెర! జనము ॥తం॥

**వచనం**:- ఆ భయంకర ఘోర వీరక్షామం ఎంత దారుణంగా వుందయ్యా? - అంటే.

**వంత(2)**:- ఎంత ఘోరంగా వుందో చెప్పండి సామీ! (రాగం)

**కథకుడు**:-"భూములన్ని బీడులాయెరా! - సై
ఏరులన్ని ఎండిపోయెరా! - సై
పసులకూ గ్రాసమ్మె - లేకపోయెనురా!
జనులకూ గింజలే రాక పోయెనురా!

**వంతలు**:- తందానో..తాన॥

**కథకుడు:**-"పచ్చి బాలెంతలూ - పసిపసీ కూనలూ
ముసిలోళ్లు - రోగాలు ముసిరి రొప్పేటివాళ్లు
॥తానతందాన॥
తినను బువ్వాలేక - త్రాగ నీళ్లే లేక
ఒక్కరొక్కరె కాటి - మొగమాయిరో!...
బిక్క చచ్చెను - మిగులు లోగిళ్లురో!.. ॥తందానో..తాన॥

**వంత(1):**- అయ్యో! సామీ! జనులను పాలించే వాడే రాజు కదా! ఇంతగా జనమూ, జీవాలూ చచ్చిపోతావుంటే...

**వంత(2):**- ఏలిక ఏకిల దొర రామానాయుడుంగా రేమీ సేయలేక పోయినారా?

**కథకుడు:**-ఎందుకు చేయలేదు నాయనలారా! చేసినాడు! తన కళ్లెదుటే తనజనం తిండీ తిప్పలూ లేక చచ్చిపోతూ వుంటే.. మా గతేమని బక్కచిక్కిన ఆవులూ, గేదెలూ, మేకలూ, కుక్కలూ అన్నీ తనవైపే కన్నీళ్లతో దీనంగా చూస్తూ వుంటే...

**వంతలు:**- చూస్తూవుంటే...?

**కథకుడు:**-నాలుగు రోజులు తీవ్రంగా ఆలోచించి.. ఆలోచించి... ఆలోచించీ... (ఆగుతాడు)

**వంత(1):**- ఆఁ ఆలోచించీ..చించీ..చించీ.

**వంత(2):**- ఏం చేసినాడో రాజు?

**కథకుడు:**-(గంభీరంగా)
"అరరరరె!...అరరరరరె!..రరెరెరె!
ఆలోచనలో దొరికెరా! - సై
ఒక్క చక్కనీ తెరగురా! - సై

ఒకరోజు తెల్లారుజామునే లేచాడు
ఊరు ఊరూనంత ఒకచోట చేర్చాడు-

**వంతలు:-** తందానా - తాన తందనా - తాన తందానానా
బక్కచిక్కినా పసుల మేకల నెల్ల ॥తందానా॥
బిక్క చచ్చినా ప్రజల బిడ్డల నెల్ల ॥తందానా॥
మూట ముల్లే కట్టమన్నాడు - ॥తందానా॥
తన తోటె ముందుకు కదలమన్నాడు ॥తందానా॥

**వంతలు:-** "తధికిట తధికిట తధిగిట థా"
**వంత(1):-** 'అయితే సామీ! ఎక్కడికనీ?
**వంత(2):-** 'ఎంత దూరమనీ?'

**కథకుడు:-** "తల్లి పుల్లామాంబ - తన్వి నరసామాంబ
తమ్ము డెఱ్రమనీడు తనతోడ రాగా
॥తానతందానా॥
ఆలు కాచేవారు - ఆరెకులు విల్లోళ్లు
పసుల మందలు - జనులు - ఆశతో రాగా ॥తాన॥
నడిచాడు తానూ - నడిపించె జనులనూ
నడిచి నడిచొక చోట - చిట్టడవి చేరాడు ॥తాన॥

**వచనం:-** అయ్యలారా! ఆ చిట్టడవిని చూడగానే అందరికీ ఒక్కమారుగా ప్రాణాలన్నీ తిరిగి వచ్చినట్లయిందయ్యా!

**వంతలు:-** ఎందుకయ్యా?....(రాగం)

**కథకుడు:-** "పేరుకేమో - చిట్టడవీ ॥తందానా॥

మేర కననీ - చిట్టడవీ "
అబ్బరించులా - గడ్డిదుబ్బులూ "
అబ్బనిపించే - సుబ్బర గాలులు "
నలుచదరంగా - ఆ అడవీ
కిలకిల పక్షుల - నెలవై వుందీ ॥తం॥

పశువులు ఒకటే - పరుగులు, ఉరకలు
అబగ గడ్డిని మేసాయీ...
ఆనందంతో తలలూపాయీ ॥తధిమి తధిమి తత్తా॥

**వచనం:-** అంతేకాదు సోదరా!

**వంత(1):-** ఆపై నేమయిందో పాడరా?

**కథకుడు:-**"అడవిలో ఒకచోట ఎత్తయిన మిట్టరా!
మిట్ట చుట్టూ - పత్తి చేలురా! ॥తానతందానా॥

మిట్ట పక్కనా - అల్లంత దూరాన
చిట్టి వూరేదో - వుందిరా ! "
ఊరికీ మిట్టకూ - మధ్య భాగాన
పాతగుడి యేదో - ఉందిరా! "
గుడిలోన దేవుడూ - లక్ష్మి నరసింహుడూ
కొలువుదీర - నిలచి వున్నాడురా! "

**వంతలు:-** తాన తందానా తాన తందానా
తందనానా తాన తానతందానా!

**వచనం:-** నాయనలారా? అది మిట్ట - చుట్టూ పత్తిచేలూ వుండినాయి.అందుమూలాన ఆవూరు పత్తిమిట్ట అనే పేరుగ వెలసింది. నాయనా! అది చిత్తూరు రాజ్యంలో వాయల్పాడు ఇలాఖాలో నెలకొని వుంది నాయనా!

**వంత(1):-** ఇదేమీ బాగాలేదు దేవరా!

**కథకుడు:-**ఎందువలన సోదరా?

**వంత(2):-** కాదా మరి? కృష్ణకవేమో కానాల యింటి వాడంటివి; వచ్చిందేమో తరిగొండ కంటివి? కత యేంది దేవరా? అంటేనూ -

**వంత(1):-** ఈ పత్తిమిట్ట కత చెబుతున్నావాయె! ఇదెట్టా కుదుర్తదంటావు సామీ?... (రాగం)

**కథకుడు:-**(నవ్వుతూ) ఓరోరోరోరె! అదియా నీ సందేహము సోదరా! అయితే విను!

"ఏకిల దొరా నాయడు గారూ...(అహ్హా)
తమ్ముడెఱ్ఱమా నాయుడు గారూ.... "
తల్లి పుల్లామాంబ - తన్వి నర్సామాంబ
గుంపుతో అక్కడే విడిశారు...
గుడిసెలూ, కుటీరాలు వేశారు

**వంతలు:-** తానతాన తందాన తందనానా...

**కథకుడు:-**"పచ్చగడ్డి - ఉండిపోయెరా! ॥తందానతాన॥
పచ్చాని చెట్లెన్నొ - కాచెరా! "
పసుల మేతకు కొరత - లేదాయెరా! "
జనుల తిండికి వసతి - కుదిరేనురా! ॥తందాన తాన॥

**వచనం:-** నాయనలారా! అందరూ ఆ ప్రత్తిమిట్ట చిట్టడవి ప్రాంతంలో విడిసి, నివాసాలు సిద్ధం చేసుకుంటున్న సమయంలో ఒకవింత జరిగింది. అదేమిటంటే?....

**వంత(1):-** ఏమిటంటే...ఏమిటో?

**వంత(2):-** సెలవివ్వండి దేవరా!....(రాగం)

**కథకుడు:**-(చిరుతలు వాయిస్తూ)

"కడుపునిండా గడ్డిమేసీ పశువులన్నీ కదలిపోయాయి..
॥భళాభళి!॥

ఏడకబ్బా పోతవంటూ - కావలోళ్లూ కదలిపోయారు..
॥భళాభళి!॥

అడ చూచిన చోద్దెమునకూ - అంతులేకా
పొంగిపోయారు ॥భళాభళి!॥

పాలనూతి మడుగు పేరా - పెద్ద చెరువును చూచి
మురిశారు ॥భళాభళి!॥

పరుగు పరుగున చేరవచ్చీ - నాయుడోరికి వార్త
చెప్పారు ॥భళాభళి!॥

**వచనం:**- ఆ వెంటనే రామనాయుడుగారు గుంపుగుంపుతో కలిసి ఆ ప్రాంతానికి వెళ్లి ఆ 'పాలనూతి మడుగును' చూచి ఎంతో నంబరపడి, తన జనులతో, "అన్నలారా!" -

**వంత:-(1)** ...ఆ..హ!

**వచనం:**- "అమ్మలారా!" -

**వంతలు:**- "అహా"!

**వచనం:**- "ఇక మనకు దిగుల్లేదు - అడవి పచ్చగా ఉంది. జల సమృద్ధీ దొరికింది. ఈ ప్రాంతంలోనే మనం శ్రమిస్తూ పంటవేస్తూ హాయిగా వుందాము.

ఆ గుడిలోని దేముడికి దీపం పెట్టి కాపాడమందాము" అన్నాడయ్యా!

**వంత(1):-** అహ! తరువాతేమయిందయ్యో? - (దరువు)

**కథకుడు:-**తరువాతే ముంది సోదరా! ఈ వలస జనము గుడిని బాగు చేసుకున్నారు. లక్ష్మీనరసింహస్వామిని సేవిస్తూ హాయిగా వుండేవారు.

**వంత(2):-** వారు హాయిగా వున్నారు సరే దేవరా! మా కతేమిటీ?

**వంత(1):-** అసలు కతేమిటీ?... ॥తధిగిణతోం॥

**కథకుడు:-**నాయనా! ఆవిధంగా ఆ వూరు ప్రశాంతంగా పాడిపంటల్తో కలకలలాడుతూ వున్న దినాలలోనే కానాల అహోబలపతి అనే ఒక బ్రాహ్మణోత్తముడు చుట్టరికం కారణంగా ఆ వూరొచ్చి స్థిరపడి నాడయ్యా!

**వంత(1):-** ఓహో! అదా లంకె! ఈ కానాల కృష్ణయ్యకూ ఆ కానాలకూ...

**వంత(2):-** సరె సరె సరేనయ్యా! తరువాతేమిటో సెలవీయ వయ్యరో!...(రాగం)

**కథకుడు:- అహోబలపతయ్య ఎవరింట ఉండేవారో అడగలేదేమి సోదరా?**

**వంత(1):-** ఇప్పు డడుగుతున్నాము దేవరా!

**వంత(2):-** ఎవరింట నుండిరా?

**కథకుడు:**-(రాగంతీస్తూ)

"వినరా తమ్ముడ! - కథ చెబుతానూ
వింతవింతగా - వుంటదిరా!..
॥తందానో-తానతందనానా॥
ప్రత్తిమిట్టలోన - పరమసాధ్వి యొకామె
సద్విప్రవంశాన - వుండేదిరా!.. ॥తం॥
లచ్చిమీ నరసమ్మ - పేరిటా అయమ్మ
దైవభక్తిలో - పొద్దు గడిపేదిరా! ॥తం॥

**వచనం:**- ఆ బాపనమ్మ - పరమభక్తురాలు లక్ష్మీనరసమ్మ ఒకనాడు కవ్వంబట్టి మజ్జిగ చిలుకుతున్నది.

**వంత(1):**- పాడివున్నోళ్లు రోజూ చేసే పనే కదా!..అదీ..

**వంత(2):**- అందులో వింతేమున్నదంటా?...(రాగం)

**వచనం:**- చూడండి నాయనా! వింతలలోకెల్లా వింత చెబుతా.. ఆమె సన్నని కూనిరాగం తీస్తూ కవ్వం తిప్పుతున్నాదిలా-

"నల్లా నల్లానయ్యకు - చల్లా చల్లని చల్లా
వెన్నా మీగడ లెంత యిష్టమో!"

**వంత(1):**- ఇష్టామో...! (దరువుతో)

"తెల్లాతెల్లని గడ్డా - పెరుగూ జిలుకూతోంటే
వల్లామాలిన వలపూ ..చల్లేనో.."

**వంత(2):**- "చల్లేనో.." (రాగం)

**వచనం:**- అలా - అయమ్మ కుండలో కవ్వాన్ని సుతారంగా తిప్పుతూ రాగంతీస్తూ చల్ల చిలుకూతూండంగా..

**వంత(1):-** తూండంగా...

**కథకుడు:-** "తాడిట్ల తిప్పితే - టకటకా ॥తానతందానా॥
తాడట్ల తిప్పితే - టకటకా ,,
తాడిట్ల తాడట్ల - తిప్పితే తిప్పితే ॥తానతందానా॥
కుండ అంచుల దాక - టకటకా టకటకా ,,

**వచన:-** అంటూ ఒకటే టకటక చప్పుడు

**వంత(1):-** ఏమిటీ..కుండలో..?

**కథ:-** ఆఁ

**వంత(1):-** ఏదో పడుంటదీ..అదే లేవయ్యా! కవ్వం కఱ్ఱకు తగులుతూ టకటకా...

**వంత(2):-** టకటకా..టకటకా... అంతేనా!

**కథకుడు:-** నిజమేనఱ్ఱా! కవ్వం కఱ్ఱకు ఏదో తగిలే చప్పుడు; చేయిపెట్టి చూస్తే..

**వంత(1):-** ఆఁ.. ఏం తగిలిందయ్యరో!

**కథ:-** ఏమీ లేదు!

**వంత(2):-** ఏందేందీ? ఏమీ లేదా?

**కథకుడు:-** ఆఁ! ఏమీ లేదు. కానీ - మళ్లీ చిలుకగా....

**వంత(1):-** టకటకా...టకటకా - తధిగిణతోం - అంతేనా!

**కథకుడు:-** చక్కగా...అంతే..అమ్మయ్య ముందాశ్చర్య పోయింది. తరువాత భయపడింది. చిలకటం మానివేసి పెనిమిటిని

కేకవేసింది - "ఏందయ్యా! ఈ మాయ?" అని వెరగుతో కలవరపడుతూ అడిగింది. ఆ యయ్య..'ఫరవాలేదు. మళ్లీ చిలుకు!...నేనున్నానులే' అన్నాడు.

**వంత(2):-** చిలికిందా..? టకటకామందా! తధిగిణతోం!

**వచనం:-** అమ్మయ్య ధైర్యంగా కవ్వంబట్టి చిలికింది. టకటకమని సవ్వడయింది. కాగానే అయ్య చేయి పెట్టి వెదకగానే..

**వంత(1):-** అఁ... ఏం తగిలిందయ్యోన్?

**వంత(2):-** ఏం దొరికిందయ్యోవ్?... ఏదైనా లప్పం.. దొరికిందా?... (రాగం)

**కథ కుడు:-**(చిరుతలు వాయిస్తూ)
"రానున్న దినములా...రానున్న దినములా
రానున్నదే కాద కీర్తి...
పత్తిమిట్టకు గొప్పకీర్తి.... ॥రానున్న॥

**వంత(1):-** తానె తందానా - తానె తందానా

**వంత(2):-** తానె తందానానా ...........

**కథ కుడు:-**"లక్ష్మి నరసింహస్వామి - లక్షణా కృతిపూని
నిగనిగా మెరిసేటి - నల్లశిలలో నిల్చి...

**వంత(1):-** "తందానెతాన"

**కథ కుడు:-**"చూడముచ్చటగాను - ముద్దులొల్కెడి రూపు
ధరియించి వారికీ దొరికాడు...
వూరంతటికి తెలిసి వచ్చారు...

**వంతలు:-** "తరిగిట తరిగిట తరిగిట తరిగిటతోం"

**వచనం:-** ఆ రాత్రే ఏకిలదొర రామానాయుడికీ ఆ స్వామి కలలో కనిపించి, తన కక్కడ గుడికట్టమని ఆదేశించినాడు. అందరూ ఆశ్చర్యపోయినారు. ఇదంతా ఆ లక్ష్మీనరసింహస్వామి మహిమేనని పొగడినారు.

**వంత(1):-** "తరువాత ఏం జేసినారయ్యో?"

**వంత(2):-** వివరంగ మాకెరుక పరచవయ్యో!

**కథకుడు:-** నాయనలారా! దొర ఒక శుభముహూర్తంలో ఆలయనిర్మాణం కోసం భూమిపూజ చేసి పాతగుడి ప్రక్కనే నేలను త్రవ్వించగా....

**వంత(1):-** ఆఁ...త్రవ్వించగా....

**వంత(2):-** ఏమయిందయ్యా? ఏమన్నా....!

**కథకుడు:-** (నవ్వుతూ) ఆఆఁ...అదే సోదరా! అక్కడా..ఆ దొరకు గుప్తధనం దొరికింది. అదీ స్వామి దయే! - అని తలచి లక్ష్మీనరసింహస్వామికి ఘనమైన ఆలయం కట్టించి నిత్యపూజాదికాలు ఏర్పాటు చేసినాడు. అమ్మయ్య లక్ష్మీనరసమ్మ తరికుండలో దొరికిన నల్లని లక్ష్మీనరసింహస్వామి విగ్రహాన్ని స్వామి ఆదేశం మేరకే ఆ దేవళంలోనే ఉంచినారు. నాయనా! ఆవిధంగా తరికుండలో స్వామి దొరికినందున ఆ పత్తిమిట్టే తరికుండై కాలక్రమంలో తరిగొండగా మారిందన్నరో!....

**వంతలు:-** "తధిగిణతోం...అదీ కథా!

**కథకుడు:-** అదే నాయనా తరిగొండ గ్రామకథ! కానాల కృష్ణయ్య చుట్టరికం కారణంగా లక్ష్మీనరసమ్మ యింటికి చేరిన

ఆ అహోబలపతి వంశంలో వచ్చినవాడు. తరిగొండలో వున్నందున తరిగొండ కృష్ణయ్య అనీ పిలిచేవారు. వీళ్లు తిరుపతి యాత్ర వెళ్లి వచ్చినారన్నాను కదా?

**వంతలు(1)**:-అన్నారు కదా!

**వంతలు(2)**:-తరువాతేమిటో తెలవివ్వండి మహాప్రభో!

**కథకుడు**:-"శ్రీపన్నగాద్రి వర శిఖరాగ్రవాసునకు
పాపాంధకార ఘన భాస్కరునకూ;
ఆ పరాత్మునకు నిత్యానపాయినియైన
మాపాలి అలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్య శుభమంగళం"
జయ మంగళం నిత్య శుభమంగళం

**----- ఒకటవ భాగము - సమాప్తం -----**



# 2వ భాగము

**వంత(1):**- "తందానా తందానా తానతందనానా"
**వంత(2):**- "తానతందనా తానతందనా - తందనాన తానా"

**ఇద్దరూ:**- "తధిగిణ తధిగిణ తధిగిణతోం"

**వంత(1):**- అయ్యా! మహానుభావా! ఆ కృష్ణయ్య మొరా-
**వంత(2):**- ఆయన ఇల్లాలి మొరా...

**వంత(1):**- ఆ తిరుపతి వేంకటేశ్వరస్వామి-
**వంత(2):**- ఆలకించినాడా?...(రాగాలాపన)

**కథకుడు:**-నాయనలారా!

**వంతలు:**- అయ్యా!

**కథకుడు:**-కోరిన వరము లిచ్చే స్వామి!

**వంత(1):**- భళా!

**కథకుడు:**-కోటి వరహాల స్వామి!

**వంత(2):**- భళా!

**కథకుడు:**-ముడుపులు తీసికొని ముద్దులు చెల్లించే స్వామి!

**వంత(1):**- భళా!

**కథకుడు:**-ఆర్తుల మొర లాలకించే స్వామి!

**వంత(2):**- భళాభళి!

**కథకుడు:**- కృష్ణయ్య దంపతుల మొర వినకుండా వుంటాడా నాయనా?

**వంత(1):-** అయితే విన్నాడంటావు?

**కథకుడు:-** ఆఁ!

**వంత(2):-** విన్నందు కేమిటయ్యా గుర్తు?

**కథకుడు:-**గుర్తు అడుగుతున్నావా తండ్రీ!

**వంత(1):-** ఆఁ!

**కథకుడు:-**అయితే విను!...

**వంత(2):-** అలాగే..చెప్పండి మరి?

**కథకుడు:-**"నందవరీకుడు - వాసిష్ఠ గోత్రుడు
కృష్ణయార్యుడెంతో...

**వంత(1):-** 'తందానా...తాన..తందనానా.."

**కథకుడు:-**"శిష్టమానసుడు - దుశ్శీల వర్జితుడు
సదమల హృదయుడు-సద్బ్రహ్మవేత్త" తమ్ముడూ...

**వంత(2):-** "తందానా..."

**కథకుడు:-**"ఆతని యిల్లాలు - మంగమాంబా తల్లి
అనుకూలవతి - తమ్ముడూ-" ॥తం॥
పాతివ్రత్యము కలది - పావన గుణమణి
పరమాత్మ - భక్తురాలు... ॥తం॥
ఇంతటి భక్తుల - ప్రార్థన విని దేవ -
దేవుడు దయచూచెనూ....

**వంతలు:-** భళాభళి! తానతాన తందాన తానతాన...
తరువాత ఏమైందయ్యారో?

**కథకుడు:**-ఒక శుభముహూర్తాన ఆ పతివ్రతామతల్లి

**వంత(1):**- అఁ...

**కథకుడు:**-ఆ మంగమాంబ...

**వంత(2):**- అఁ....

**కథకుడు:**-"పండువెన్నెల కాంతి - పాలరాతీ కాంతి
పరచు కొన్న తీరునా.... ॥తం॥
ముద్దయిన బొద్దయిన
అద్దాల చెక్కిళ్ల.... ॥భళా॥
నిగనిగాలాడేటి - నీలాల కేశాల
బోసి నవ్వులనోట - దొండపండు పెదాల
ఆడ నిసువును కన్నదీ...

**వంతలు:**- "తాన తందనా తందనాన తానా..."

**వచనం:**- ఆ పసికూనకు పురుడుపోసి, జాతకర్మ చేసి, ఆ తిరుమల వెంకన్న అనుగ్రహమున జన్మించినందున ఆ కూనకు "వెంగమాంబ" అని నామకరణం చేసినారు నాయనలారా!

**వంతలు:**-"తధిగిణ తధిగిణ తధిగిణతోం - తందరి తానతాననానా!"

**కథకుడు:**-(రాగం తీస్తూ)
"తల్లి పాలూ తాగి - మెల్లగా శయనించు
మేలుకున్నా కూడ - మేళమ్ము వాగదూ...
ఏడుపన్నా మాట - ఆ నోట వినరాదు
రెండు చేతుల దరువు - తాటించి కేరాడు" ॥తం॥

**వచనం:-** అంతేకాదు నాయనలారా!

**వంత(1):-** మరి ఇంకా యేమో చెప్పు...

**కథకుడు:-** "అమ్మ వెంకన్న పైన - ఆలపిస్తూ వుంటె
చెవులొగ్గి వింటూన్న - తీరులో కనిపించు
॥తానె తందానా॥
అయ్య చేతిలొ గంట - మ్రోగితే చాలింక
కాళ్లు సేతుల నొక్క - ఊపునా కదిలించు॥తానె॥

**వంత(2):-** ఇంకా...?

**కథకుడు:-** "మందవారములందు - దాసాంగమును చేసి
కూన నుదుటను నామ - ముంచబోతే చాలు ॥తానె॥
కదలదూ మెదలదూ - నామమ్ము నిడు కొనును
వెంకన్న అంటేను - ఎంత ఉల్లాసమో...

**వంతలు:-** "తానె తందానా-తానెతందానా-తానెతానెతాని తాన
తందనానా తరిగిట ఝుం"

**వచనం:-** సోదరులారా!

**వంతలు:-** ఆఁ!

**వచనం:-** ఆ ఏడుకొండలవాడి దయవల్ల పుట్టిన కూన
అయినందుకో ఏమోకానీ...

**వంత(1):-** కా...నీ... (రాగం - దరువూ)

**కథకుడు:-** నిసువుగా వున్నప్పటి నుండే ఆ కూన వెంగమాంబకు
కళ్లూ చెవులూ ధ్యాసా అంతా కూడా ఆ ఏడు
కొండలవాని మీదే అన్నట్టుగా వుండేది!

**వంత(1):-** ఆహాఁ! మరి కూన పెరగలేదా?

**వంత(2):-** ధ్యాస తరగలేదా మహా ప్రభో?(దరువు)

**కథ కుడు:-** పుట్టిన శిశువులు పెరగకుండా వుంటారా నాయనా? పెరగనిదే మన మింతవాళ్ల మయినామా?

**వంత(1):-** అవునవును...పెరిగేము...పెరిగేము

**వంత(2):-** పెరిగాము..పెరిగాము.. తధిగిణతోం... తరువాతే మయిందో చెప్పండి...మహాప్రభో? (రాగం)

**కథ కుడు:-** (ఆలాపన)

"పూసిన మొగ్గా - పువ్వవుతున్నాది॥తందానతాన॥
విరిసే పువ్వూ - వీచేగాలీ ,,
చూసే కళ్లకు - తాకే ఒళ్లుకు ,,
ఆనందమందించురో సోదరా ! ,,
హాయనీపించేనురో! ॥తందానతాన॥

**వచనం:-** నాయనలారా!

**వంతలు:-** అయ్యా!

**వచనం:-** బాల వెంగమాంబ క్రమక్రమంగా ప్రవర్ధమాన అవుతూ వచ్చింది. ఏలాగున నంటే...

**వంత(1):-** ఏలాగో సెలవివ్వండి స్వామీ!....

**కథ కుడు:-** (రాగం)"పున్నమీచంద్రుడు - పున్నమీ చంద్రుడు
పుడమికీ దిగినాడో.... ॥తం॥
పూల చెండుల్లూ - పూలచెండుల్లూ
పుడమీని దొర్లేనో.... ॥తం॥

చలికొండ కోనల్ల నుండీ ॥తం॥
రాయంచ దిగి వచ్చెనేమో ॥తం॥
రాయంచ దిగివచ్చి - రాయంచ దిగివచ్చి
రాచనగరూ చేరెనో ॥తందానో తాన॥

**వచనం:-** అన్నట్లుగా అందముగా కృష్ణయ్య దంపతుల ఇంటికే కాదు, వూరిజనానికే చూడముచ్చటగా పెరగసాగింది వెంగమాంబ.

**వంత(2):-** భళా! భళాభళి! తానతందనానా...

**వచనం:-** అయితే...

**వంత(1):-** అయితే...గియితే...
**వంత(2):-** మళ్లీ ఆ కొతుకేమిటయ్యా?

**కథకుడు:-** "వయసేమొ వస్తానె వుందీ-కాని,
మనసేమొ యేడనో వుందీ... ॥తం॥

ప్రొద్దు పొడిచిన దాది - ప్రొద్దు గుంకేదాక
నిద్దరొయ్యేదాక - నిద్దర్లొ మెలకువలా
వేంకటేశ్వరు ధ్యాసలో - వెంగమ్మా
అన్నపానాలే మరచినాదీ.... ॥తం॥

**వచనం:-** ఆ చిన్నారి తల్లి -

**వంత(1):-** ఆహాఁ!

**వచనం:-** ఆ అందాల మల్లి ....

**వంత(2):-** ఆహాఁ!

**వచనం:-** ఆ వేంకటేశ్వరుని మీదనే ధ్యాసమల్లి ప్రొద్దస్తమానమూ, ఆ లక్ష్మీనరసింహస్వామి... ఏ లక్ష్మీనరసింహస్వామి?

**వంత(1):-** ఆ....తరిగొండ లక్ష్మీ నరసింహస్వామి...

**వచనం:-** ఆఁ! ఆ లక్ష్మీనరసింహస్వామి దేవాలయమే ఇల్లు చేసుకొని ఒళ్లంతా కళ్లుగా ఆ స్వామి దివ్యమంగళ విగ్రహమే చూస్తూ...నోట దొర్లిన పాటలే పాడుతూ...

**వంత(2):-** పాట? నోటికి వచ్చిన పాట? ఆ చిన్నారినోట పాట?

**వచనం:-** ఆఁపాటే...

**వంత(1):-** ఏదీ...ఏదయ్యా ఆపాటా?

**వంత(2):-** ఏదీ... ఏ పాట పాడిందో వినిపించూ...

**కథకుడు:-**(రాగం)"శరణు శరణూ - శరణు శరణూ
శరణు శరణూ - శరణు శరణూ
శరణు శరణూ - త్రిలోకనాయక!
శరణు పురహర సాయకా!
శరణు ముక్తి ఫలప్రదాయక!
శరణు భక్త సహాయకా!
శరణు శ్రీ తరిగొండ మందిర!
శరణువత్స ధృతేందిరా!
శరణు మోహన! దివ్యసుందర!
శరణు దరనిభ కంధరా!

**వంత(1):-** భళా! భళారే! పాట! భళా!

**వంత(2):-** చిన్నికూన అయినా ఇంత సొగసుగా పాడుతున్నదంటే.

**కథకుడు:-** అంతా ఆ తరిగొండ లక్ష్మీనరసింహస్వామి అనుగ్రహమే నాయనా! ఇక్కడ మరియొక్క విశేషమూ ఉన్నది నాయనా!

**వంత(1):-** అదేమిటో సెలవివ్వండి మహాప్రభో!

**కథకుడు:-** ఆ చిన్నారి వెంగమాంబకు శ్రీ తరిగొండ లక్ష్మీనరసింహుడే అన్నీనూ...

**వంత(2):-** అన్నీ...నూ.. అంటే స్వామీ?

**కథకుడు:-**ఏడుకొండల వేంకటేశ్వరునకూ, ఆ కైలాసాచల వాసునకూ, ఈ తరిగొండ స్వామికీ ఆమె దృష్టిలో అభేదమే నాయనా!

**వంత(1):-** అభేదమో - దుర్భేదమో స్వామీ! మాకందరికీ అర్థమయ్యేలా చెప్పుదురు గాకా...

**కథకుడు:-** నాయనలారా! తరిగొండ వెంగమాంబ లక్ష్మీనరసింహుని లోనే శ్రీనివాసునీ, ఆ శ్రీనివాసునిలోనే లక్ష్మీనరసింహునీ చూడగలిగిందని, ఆ లక్ష్మీనరసింహుని లోనే శ్రీకృష్ణునీ దర్శించగలిగిందా తల్లి!

**వంత(2):-** అలాగని మీకామె చెప్పిందా ఏమిటండీ? (దరువు)

**కథకుడు:-**నాయనా! ఆమె పాడిన ఈ పాట విను!

**వంత(1):-** ఏదీ స్వామీ? పాడి వినిపించండీ!...

**కథకుడు:**-(ఆలాపన)
"గిరిధాముని గూడరే! - గిరిగిట్లంద రాడరే!
గోవిందుని గూడరే! - కోలాటాలంద రాడరే!
శ్రీనివాసుని గూడరే! - పూని పదముల పాడరే!
తరిగొండేశుని గూడరే! - తిరిగి గొబ్బిళ్లాడరే!"

**వంత(2):**- ఆహాఁ! ఎంత అద్భుతమండీ! అందరు దేవుళ్లనీ ఆ తరిగొండస్వామిలోనే చూచే ఆ భక్తురాలి గొప్పే గొప్ప!

**కథకుడు:**- కానీ... ఆ పసిదాని భక్తిమహత్త్వం ఆమె తల్లిదండ్రులకూ, వూరి పెద్దలకూ అవగతం కాలేదు, అందుచేతా...

**వంత(1):**- ఏం చేసినారేమిటీ?

**కథకుడు:**-"గాలిసోకిందంటూ తలచారూ ॥తం॥
పోలి దిష్టీ తీసి వేశారూ ,,
భూతవైద్యుని తెచ్చి చూపారూ ,,
వాతలెన్నో పెట్టి వంచారూ ,,
వూరూరు వూరూరు తిప్పారూ ,,
తిరుణాళ్ల సంబ్రాలు చూపారూ ,,

**వచనం:**- అయినా...ఆమె పద్ధతి కించిత్తయినా మారలేదు సోదరా! పైపెచ్చు..

**వంత(2):**- ఆఁ! పైపెచ్చు ఏం జరిగిందయ్యా?

**కథకుడు:**-"ఒకవూరి తిరణాళ్లో తమ్ముడా! ॥సై॥
వేంకటేశుని బొమ్మ తమ్ముడా! ,,
కొనితెచ్చి యిచ్చారు తమ్ముడా! ,,
ఇంకేమి చెప్పాలి తమ్ముడా? ,,

**వంతలు:**- సై సై సై సై సై... చెప్పకపోతే మాకెట్టాగయ్యా తెలిసేది?

**కథకుడు:**- ఆ చిన్ని వెంగమాంబకు ఆ బొమ్మతోడిదే లోకమై అన్నమూ, పానమూ, నిద్రా అన్నీ మానేసి ఆ బొమ్మతోనే ఊసులాడేది; పాటలు పాడేది; జోలపాడేది; కనులుమూసి పరవశించి లోకమే మరచిపోయేది.

**వంత(1):**- మరి అమ్మా నాన్న లేంచేశారయ్యా స్వామీ?

**కథకుడు:**-అప్పుడు-

**వంత(2):**- ఆహఁ!

**కథకుడు:**-ఆ పిల్లకు ఎనిమిదేళ్లేనయ్యా!

**వంత(1):**- అయితే నేమటా? (దరువు)

**కథకుడు:**-(రాగంతీస్తూ) "అష్ట వర్షా భవేత్ కన్యా" అని శాస్త్రం వుండబట్టి...

**వంత(2):**- ఉంటేనేమి బట్టి...

**కథకుడు:**-అమ్మాయికి మంచివరుణ్ణి చూచి పెళ్లిచేసేస్తే....

**వంత(1):**- ఆ....చేసేస్తే..!

**కథకుడు:**-ఇక ఆ సంసార సాగరంలో మునిగి ఈ గాలిపిచ్చి చేష్టలన్నీ వాటంతటవే పోతాయనుకొనీ...

**వంత(2):**- అనుకోనీ తందానా?
**వంత(1):**- ఏం చేసినారో తందనానా?

**కథకుడు:**-"కన్నకూతురికి - చిన్నదానికీ
మనువు చేయదలచీ.... ॥తందానతాన॥

కాలికీ బలపం - కట్టి తిరిగెనూ
కృష్ణయార్యుడంతా ॥తం॥
కానీ ఒక్కడు - కలిసి రాలేదు
కర్మగాలినట్లూ... ॥తం॥

**వచనం:-** అమ్మాయి బాగాలేదా?

**వంత(1):-** బాగుంది కదా! (దరువు)

**వచనం:-** కుటుంబం మంచిది కాదా?

**వంత(2):-** ఎంతో మంచిది కదా? (దరువు)

**వచనం:-** మరయితే వెంగమాంబను మనువాడేందుకు ఒక్క మగవాడూ ఎందుకయ్యా రాలేదూ!

**వంత(1):-** ఎందుకయ్యా రాలేదూ?
**వంత(2):-** తరికిట తరికిట తరికిట థా.

**కథకుడు:-**(ఆలాపన)
"ఇంటివాడే పెట్టె - కంటిలో మంటనే
సామెతుంది కదరా! ॥తం॥
ఇరుగు పొరుగూకె - ఇంతింత అనరాని
ఈసు వీరిమీదా- ॥తం॥
పనిగట్టి మరిమరీ - వెంగమాంబామీద
గాలి కతలనెన్నో.... ॥తం॥
కల్పించి చెప్పారు - చాడీలు వూదారు
పిచ్చి బాగులదనీ - పితూరీలు చెప్పారు
వచ్చినట్లే వచ్చి - వరుని సంబంధాలు
వెను దిరిగి పోయేవీ ॥తం॥

**వంతలు:-** 'తందానో...తానె..తందనానా'...

**వచనం:-** ఆ విధంగా ఇరుగు పొరుగువారే అసూయతతో లేనిపోనివి చెప్పి సంబంధాలు కుదరనిచ్చేవారు కాదు.

**వంత(1):-** ఆఁ ఆఁ అయినా...?

**వచనం:-** చిత్తూరు దగ్గర నారగుంటపాళెం అనే ఒకవూరిలో వరుడు దొరికినాడయ్యా!

**వంత(2):-** ఆహాఁ దొరికాడు...దొరికాడు - ఎవరయ్యా ఆ భాగ్యశాలి?

**వంత(1):-** పరమభక్తురాలు వెంగమాంబను పెళ్లాడబోయే ఆ అదృష్టవంతు డెవరయ్యరో?..(రాగం)

**కథ కుడు:-**(ఆలాపన)

"నారగుంట పాళేనా - శ్రీవత్సస గోత్రుడూ
ఇంజేటి తిమ్మయార్య - కిష్టా కుమారుడూ

**వంతలు:-** "తానా-తందానా-తాన-తాననానా

**కథ కుడు:-**"వెంకటాచలపతే - వెంగమాంబ వరుడూ ॥తాన॥

లేనిపోనీ వెన్నొ - చెప్పినారురా!
ఇరుగు పొరుగు వారూ.. ॥తం॥
పిచ్చిదన్నారురా - వెర్రిదన్నారురా!
ఈసు చెందిన వారూ - ॥తం॥

ఆమెనూ పెళ్లాడి - అనదవై పోతావు
వద్దు వద్దన్నారురా!- ॥తం॥

**వచనం:-** అయితే....

**వంత(1):-** అయితే గియితే ఏమైందయ్యారో?...(రాగం)
**వంత(2):-** అందరిలాగే వెనక్కి ఏడడుగులు వేసినాడా?

**కథకుడు:-**అహ!
"చెప్పేడు మాటలు వినడురా!... ॥సై॥
తప్పేడు బాటను పోడురా! ,,
చక్కాని చుక్కా - కేముంది తిక్కా?
తాళిగట్టితె తిక్క - కుదిరిపోవును చుక్క
అనుకున్నవాడుర! - వరుడూ ,,
వియ్యమంద సిద్ధ పడెనూ ,,

**వంతలు:-** "తధిగిణ తధిగిణ తధిగిణతోం"

**వచనం:-** ఆ రీతిగా వెంగమాంబ చక్కదనం చూచీ, ముద్దు మోమును మెచ్చీ, పెళ్లయితే పిచ్చీ గిచ్చీ కుదురుతుందని వెంకటాచలపతి అమ్మాయిని యిష్టపడినాడు. కృష్ణయ్య దంపతులు వైభవంగా పెళ్లిచేసినారు...అయితే...(రాగం)

**వంత(1):-** మళ్లీ ఈ అయితే ఏమిటయ్యా మహా ప్రభో?
**వంత(2):-** మళ్లీ కతేమన్నా మొదటికే వచ్చిందో భామతో?

**కథకుడు:-**అదేదీ కాదు నాయనలారా!

**వంత(1):-** అయితే మరేదో సెలవీయవయ్యా మహాప్రభో!

**కథకుడు:-** (అలాపన)

"పెళ్లి పెళ్లీ పెళ్లి - పెళ్లి పెళ్లంటారు
ఈ పెళ్లి నేనొల్లనయ్యా! - ॥తందా..నో..॥
నే నెవరి పెళ్లామొ - తెలియకుండా మీరు
ఈ పెళ్లి చేస్తారె అమ్మా-!
చిన్ననాటానుండి - చిత్తాన శ్రీహరే
నిన్న మొన్నా నేడు - రేపు కూడా హరియె
శ్రీ తిరుమలేశునీ - సొత్తునయ్యా నేను తండ్రీ!
నాకెందు కీ వుత్త పెండ్లీ? ॥తం॥

**వచనం:-** అంటూ నిత్యమూ తలిదండ్రులతో వాదించింది; వాదిస్తూనే వుంది. పెళ్లైనాక కూడాను... అది బాల్య వివాహం కనుక.

**వంత(1):-** అయ్యొయ్యొయ్యా! ఆగాగు! ఏందీ....బాల్య వివాహమా?

**వంత(2):-** ష్! గట్టిగా అనకయ్యా! ఈ ప్రభుత్వం వినిందటే, మనమీదకూ దాడి చేస్తుందీ...

**కథకుడు:-**(నవ్వుతూ) నాయనా! మనమిప్పటి మాట కాదు గదా చెబుతూన్నదీ...

**వంత(1):-** ఔను కదరా! (దరువు)

**(2):-** ఔనౌను కదా!

**కథకుడు:-**అవి వందల యేళ్లనాటి ఆచారాలు. మంచికో చెడ్డకో వాళ్లు పాటించేవారు. మంచి జరిగిందా...

**వంత(1):-** ఆఁ.

**కథ కుడు:**-శుభం అనేవారు.

**వంత(2):**- కీడు జరిగెనా... (రాగం)

**కథ కుడు:**-అంతా కర్మ అనేవారు.

**వంత(1):**- ఓహో!

**కథ కుడు:**-అందుకే వెంగమాంబకూ బాల్యవివాహమే జరిగింది. పద్ధతి మార్చుకో లే దా తల్లి.

**వంత(2):**- ఎట్టాగయ్యా మరీ?

**కథ కుడు:**-అంతలో ఒక శుభ ముహూర్తాన వెంగమాంబ వ్యక్తురాలయిందీ.

**వంత(1):**-ఏందో మా కయితే బొత్తిగా అర్థం కాలేదు.

**కథ కుడు:**-నాయనా... అమ్మాయి పుష్పవతి అయింది.

**వంత(2):**- ఓహో! ఓహ్- ఆఁ ఆఁ సరె సరె సరె - అంటేనూ తదుపరి కార్యక్రమం ఏదో జరిపీ - ఆ తల్లి నింక అత్తవారింటికీ తోలేస్తారన్నమాట.

**వంత(1):**- అన్న మాటేమిటిరా తమ్ముడూ! ఉన్న మాటే కదా అది? ఆడపిల్లలనూ మెడపట్టి అత్తారింటికి తోసేసీ.... చేతులు దులుపుకొనీ... హమ్మయ్య అనుకోవటం మన కలవాటే కదరో!... (రాగం-దరువూ)

**కథ కుడు:**-తప్పు నాయనా! తప్పు! ఇదేమీ చేతులు దులుపుకొనే సంప్రదాయం కాదు.

**వంత(1):**- మరి?

**కథకుడు**:-దాంపత్య జీవనం.

**వంత(2)**:- అంటే...!

**కథకుడు**:-నిండు నూరేళ్లూ అలూమగలూ సుఖంగా సాగాలీ అనుకొని అపేక్షించి ఆశీర్వదించి మమతానుబంధాల విలువ లోకానికి చాటే చదువు.

**వంత(1)**:- ఆ....ఏం చదువో...ఏమోలెండి!

**వంత(2)**:- మరా చదువు వెంగమాంబ చదివిందంటారా?

**కథకుడు**:-అదే చెబుతూన్నాను.

**వంతలు**:- చెప్పండీ!.... తాన తందనానా.

**కథకుడు**:-(రాగం)

"మంచి ముహూర్తం చూచిన పెద్దలు ॥తందన తానా॥
ఎంచి ఘడియలు - వేడుక చేసిరి ,,
బంధువులు వచ్చిరి - విందులు గుడిచిరి ,,
శోభన గృహమూ - అలంకరించిరి ,,
అమ్మలక్కలూ - పేరంటాండ్రూ ,,
ఛలోక్తు లాడిరి - చతురూ చేసిరి ,,
పాటలు పాడిరి - ఆటలు ఆడిరి ,,
మంగళారతీ - ముదమున నిచ్చీ ,,
వెంగమాంబనూ - లోనికి పంపిరి ,,

**వంతలు**:- "తానతందనా-తధిగిణ తధిగిణ తధిగిణథా॥

**వచనం**:- అప్పుడేమయిందయ్యా? అంటే...

**వంత(1):-** ఏమో ఏమవుతుందయ్యా స్వామీ! అందరికీ అయ్యేదే అవుతుంది. అంతే కదా!

**వంత(2):-** "శోభనమే...శోభనమే...ఆ-" (రాగం)

**కథకుడు:-** ఏమయ్యిందంటేనూ... (రాగాలాపన)

"పెళ్లి కూతురూ - ముస్తాబయ్యీ - లోన వస్తు వుంటే"
॥తందానా-తాన॥
నింగినుండీ చందమామే - నేలకు దిగివస్తూ వుందీ
॥తందానా-తాన॥
మబ్బులోని మెఱపె - గదిలోకి వచ్చి - మెఱసి పోతున్నాదీ,, ॥తందానా-తాన॥

**వచనం:-** అని అనుకున్నాడు కొత్త పెళ్లికొడుకు వెంకటాచలపతి.

**వంత(1):-** కొత్తపెళ్లికొడుకూ-వెంకటాచలపతీ.

**వంత(2):-** చలపతి కాకుంటే మరోపతి ఎలా అవుతాడు తమ్ముడూ ?

**వచనం:-** తప్పు నాయనలారా! అపభ్రంశాలూ అవాకులూ పలకరాదు.

**వంత(1):-** (లెంప లేసుకుంటూ) తప్పు - తప్పు - అప్పుడేమయిందో చప్పున చెప్పండప్పా! - (రాగం)

**కథకుడు:-** (ఆలాపన)

"కొత్త పెళ్లికూతురిలా - సిగ్గూ బిడియాలు గప్పి"

**వంత(1):-** "తందనానా - తందనానా"

**కథకుడు:-** "తలవాల్చి ఒయారంగ - అడుగులోన అడుగువేసి"

**వంత(2):-** "తందనానా ....తందనానా"

**కథకుడు**:-"అంచలాగో - మదగజంలాగో"

**వంత(1)**:- "తందనానా - తందనానా"

**కథకుడు**:-"వెంగమాంబా..." (ఆగుతాడు)

**వంత(2)**:- ఆఁ వెంగమాంబ?

**కథకుడు**:-రాలేదయ్యరో!... (రాగంతీస్తూ)

**వంత(1)**:- తళాంగు తధిగిణతోం (దరువు)

**వంత(2)**:- ఇదేమి వింత మాప్రభో?

**కథకుడు**:-"వింతలకే ఇది - వింతరా!.... ॥సై॥
సుంతయినా - సిగ్గు పోదురా! ,,
చింతా వంతా లేని కాంతగా ,,
చెంత చేరి కాంత నిల్చెరా!...॥తధిగిణ తధిగిణతోం॥

**వచనం**:- వేంకటాచలపతి వద్ద...తన మెడలో మంగళసూత్రం కట్టిన మగని వద్ద.

**వంత(1)**:- ఎవరివద్దా..? అగ్నిసాక్షిగా తాళికట్టిన తన పెనిమిటి వద్ద.

**వచనం**:- వెంగమాంబ నిలుచుంది. తనచేతి పాల స్థాళిని-

**వంత(2)**:- వయ్యారాలు పోతూ - తన మగని చేతి... కందిం చిందీ.. (రాగం)

**వచనం**:- లేదు నాయనా!

**వంత(1)**:- ఏమిటీ! లేదా! అదెట్లాగయ్యా?

**కథ కుడు:**-వినండి తమ్ముళ్లారా! ఆ పాల స్థాళీని ప్రక్కన బల్లమీద నుంచి, రెండు చేతులూ జోడించి, వేంకటాచలపతిని చూస్తూ....

"నీవెవ్వరో ఎరుగనయ్యా!..... ॥తందాన॥
నే నెవ్వరో నీకు తెలుసా? ,,
జన్మ జన్మల నుండి ,,
వేంకటేశుని దాన.... ,,
నా రూపు నాచూపు.... ,,
నా చేత నా కూత... ,,
తరిగొండ శ్రీలక్ష్మి ,,
నారసింహునివే'
తిరుమలా గిరిలోని
శ్రీ వేంకటేశునివే!... ,,

**వచనం:**- అంటూ తత్త్వం పాడి... "ఆ పరమాత్మునకు అంకితమైన నా శరీరం మీద నీకు అధికారం కలదా? తాళిగట్టితివి; సరే...ఈ దేహం నీదే! కానీ నా చిత్తం ఆ శ్రీనివాసాయత్తం! ఈ దేవదత్తమైన తనువును తాకి అపవిత్రం చేసి 'ఎంగిలిని' దైవాని కిచ్చెదవో; నీవు వచ్చిన దారినే పోయివచ్చెదవో నీచిత్తం!". అంటూ ఆ తిరుమలవాసునే స్మరిస్తూ కళ్లు మూసుకున్నదయ్యా!

**వంత(1):**- ఆహా! ఏమి చోద్యం! ఏమి చోద్యం?

**వంత(2):**- ఇంత వింత కళ్యాణ కథ మే మెన్నడూ వినలేదయ్యా!

**వంత(1):-** తరువాతేమయిందో సెలవియ్యవయ్యా?

**కథకుడు:-**(రాగాలాపనం చేస్తూ)
"ధ్యానమూర్తియై - రాతిబొమ్మలా - నిల్చుందిరా! వెంగమాంబా"

**వంత(1):-** "తందానా...తందానా...తానతందనానా"
"ఆ భంగిమలో - ఆ రూపురేఖలో - అతని కేదో తోచెరా!" ॥తం॥
దిగ్గునా దిగి మంచ, - మెగగట్టి తనపంచె
తలవంచి దండాలు - పెట్టాడూ
తలుపుదీసీ పరుగు దీశాడు" ॥తం॥

**వచనం:-** పెళ్లి కొడుకు వైపు చుట్టాలూ, పెళ్లి కూతురు వైపు చుట్టాలూ పక్కాలూ అందరూ నోరెళ్ల బెట్టినారు. పెళ్లి కొడుకు బంధు బలగ మంతా మాకీ వధువు వద్దంటూ వారి గ్రామానికి వెళ్లి పోయినారు.

**వంత(1):-** అరర రెరెరె!...

**వచనం:-** కృష్ణయ్య దంపతులు లబోదిబోమంటూ వెంగమాంబను పెట్టని చీవాట్లు పెట్టీపెట్టీ సొమ్మసిల్లి పోయినారు.

**వంత(2):-** అయ్యయ్యయ్యయ్యో!

**వచనం:-** వెంగమాంబ మాత్రం తనచిత్తమంతా వేంకటేశ పదార విందాయత్తం చేసి దూషణ భూషణ తిరస్కార పురస్కారా

లకు అతీతంగా ధ్యానంలో మునిగిపోయింది నాయన లారా!

**కథ కుడు వంతలు** } "మాధవాయ జయమంగళం
విధినుత చరణాయ - వేదోద్ధరణాయ
మధుదైత్య హరణాయ - మంగళం!
మందరోద్ధరణాయ - మంగళం - విమల
కుందాళి రదనాయ - గురుతర తరిగొండ
మందిరాయ శుభ మంగళం!!"

**----- 2వ భాగము సమాప్తం -----**



## 3వ భాగము

**కథకుడు:-** "నందనందన! తే - నమో! నమో!
సానంద హృదయ! తే - నమో! నమో!
నారాయణ! పరిపూర్ణ సుధాకర వద
నా! మాధవ! తే నమో! నమో!
నారద సనక సనందన నుతపద
నళిన యుగళ! తే నమో! నమో!
వరతరిగొండ నివాస! పరాత్పర!
నరమృగవర! తే నమో!నమో!
గురుతర పన్నగ గిరినాయక! బహు
నరపూజిత! తే నమో! నమో!
నంద నందన! తే నమో! నమో! నమో!నమో!"

**వంత(1):-** ఆహా! ఎన్నాళ్ల కెన్నాళ్లకు అన్నమయ్య కీర్తన పాడి మా చెవుల తుప్పు వదిలించినావు స్వామీ!

**వంత(2):-** ఏమీ! వెంగమాంబ కథలో అన్నమయ్య కిరీట మేందిరో? ఏంది స్వామీ! వీడి వాగుడూ?

**కథకుడు:-**(నవ్వుతూ) అది అతని పొరపాటు నాయనా! తమ్ములారా!

**వంతలు:-** అయ్యా!

**కథకుడు:-**అదీ అలనాటి అన్నమయ్య కీర్తన "నారాయణ తే నమో నమో" బాణీలోనే ఆ పద కవితా పితామహుని కీర్తనలు వినిన ప్రభావం చేతనో ఏమో, మన తరిగొండ వెంగమాంబ పాడిన కీర్తన నాయనా! ఇది.

**వంత(2)**:- ఏమిటీ! ఇది వెంగమాంబ కీర్తనా?

**కథకుడు**:- ఇంతకు ముందునువు మాకు వినిపించిన మంగళం పాటలూ, ఆరంభంలోని గణపయ్య స్తోత్రమూ కూడా వెంగమాంబ రచనలే నాయనా!

**వంత(2)**:- ఏందేందయ్యోవ్! అంత చక్కని పాటలన్నీ ఆమె రాసినవేనా?

**కథకుడు**:-ఉత్త రాయటం మాత్రమే కాదు నాయనా!

**వంత(1)**:- మరేఁ? (దరువు)

**కథకుడు**:- అప్పటికప్పుడు ఆ భక్తురాలి తలలో కలిగిన తలపులను వెంటనే పాటగట్టి స్వామి మీద పాడి పరవశించి పోయే ఆశు కవయిత్రి...

**వంత(2)**:- అదేమిటయ్యా? అసుపత్రేందయ్యా యిక్కడా?

**కథకుడు**:- (నవ్వుతూ) అసుపత్రీ జాపత్రీ కాదు నాయనా! ఆశు - కవయిత్రీ అంటే అప్పటి కప్పుడే పాటా, పదం కట్టి స్వామిని కీర్తించే కవయిత్రి అని. ఆమె అక్షరశారదా కటాక్షం పొందిన పరమయోగిని కదయ్యా!

**వంత(1)**:- అంటే.. ఇప్పుడు...నువు పాడిన పాట?

**కథకుడు**:-ఆఁ!

**వంత(2)**:- ఆయమ్మదే నంటావు?

**కథకుడు**:-ఆఁ!

**వంత(1):-** అదికాదయ్యా!పెళ్లి పెటాకులయి పోతే... ఈమె... ఎవరూ?

**వంత(2):-** ఈమె...

**వంత(1):-** ఆఁ ఆమె...వెంగమాంబ పాటలు పాడుకుంటూ సంబరంగా కూచుందా? ఇదేం విడ్డూరమయ్యా?

**కథకుడు:-**(ఆలాపన)

"సంబర మెవరికి - సంబర మెవరికి
డంబముకదరా! పెళ్లీ.... ॥తందనతానా॥
నిరాడంబరముగ - సదానందమున ,,
నిశ్చల భక్తిలో మునిగీ... ,,
పెళ్లికి ముందూ - ఆ తరువాతా ,,
ఒకటే చింతన నుండీ ,,
నిరీహ నిస్పృహ నిరంజనముగా
సాగెడి వెంగమ సుండీ! ,,
తిరుమల వాసునె వలచినదీ ,,
తరిగొండేశునె నమ్మినదీ ,,

**వంతలు:-** "తాన తందనా తందనాన తానా"

**వచనం:-** కనుక - ఆమె - ఆ తల్లి - ఆ భక్తురాలు సంబరాన కాదు నాయనా! మునుపటి భక్తిభావనతోనే - ఇంజేటి వెంకటాచలపతి పరిగెత్తిపోయినా, ఆ తరిగొండ లక్ష్మీనరసింహునిలోనే అందరు దేవుళ్లనూ దర్శిస్తూ అలా గానం చేస్తూ తనను తానే మరచిపోయేది.

**వంత(1):-** తిండీ - తిప్పలూ?

**వంత(2)**:- స్నానం - పానం?

**కథకుడు**:-(రాగం తీస్తూ)

"తిండిమీదా ధ్యాస లేదాయే
ఉండికూడా తాను లేదాయే
॥తందానో తందానా తాన తందనానా॥
కంటిమీదా కునుకు రాదాయే ,,
ఒంటి మీదా ఆస లేదాయే ,,
దప్పికా కలుగా లేదాయే ,,
నొప్పియేమో తెలిసి రాదాయే ,,
రాత్రి పగలూ స్వామి పదమేనాయే ,,
ఆత్రమంతా స్వామి మీదాయే ॥తం..తం...తం॥

**వంతలు**:- "తధిగిణ తధిగిణ తధిగిణతోం"

**వంత(1)**:- అయ్యా! ఇట్లాంటి బిడ్డను అమ్మా నాన్నలు ఇంట బెట్టు కుంటారా?

**వంత(2)**:- కన్నకడుపు తీపి కదరా!...పో...గొట్టుకుంటారా?

**కథకుడు**:-ఏ అమ్మా నాన్నా అయినా బిడ్డను వెళ్ళేసుకుంటారా? నాయనా!

**వంత(1)**:- మరయితే తరువాత కతేమిటో సెలవివ్వండి స్వామీ!

**కథకుడు**:-చెబుతాను వినండి నాయనా! (ఆలాపన-తంబూరా వాయిస్తూ)

**వంతలు**:- (లయబద్ధంగా దరువు)

**కథకుడు**:-"**మాయమ్మో!** మాయమ్మో! మాయమ్మో!
**నీకు దండాలు** పెడతాము వెంగమ్మో!

**వంతలు:**- 'దండాలు పెడతాము వెంగమ్మో!' - హాఁ!

**కథకుడు:**-"మాతల్లి! మాతల్లి! మాతల్లో!
నీకు మంచి చెబుతాం వినవె - పెత్తల్లో!

**వంతలు:**- "మంచి చెబుతాం వినవె పెత్తల్లో!"

**కథకుడు:**-"ఏ నాడు కానాల బాపనోళ్ల కులాన ॥బా॥
ఈ పాడు చేయరే కూనా!
నీకేమి అయ్యిందె చానా?

**వంతలు:**- 'అహ చానా! ఓహో కూనా! - తందనానా'

**కథకుడు:**-'ఆడపిల్లకు పెళ్లి ॥తందానా॥
ఈడులో చేయాలె ,,
మనువాడినా పిల్ల ,,
మగనింటి కెళ్లాలె ,,
మర్యాద గల భామ ,,
మగనితో చేరాలె ,,
అరరరరరె!....చెబితే వినవే! ఓసి పిశాచీ!
మడిసికి దేవుడు మగడేంటే?

**వంతలు:**- 'మగడేంటే'?

**కథకుడు:**- "దేవుడె మగడూ - దేవుడు మొగుడూ
దేవుడె దేవుడె అంటావే?
మన వంశం పరువును తీస్తావే!
కులం ధ్వంసం భస్మం చేస్తావే!"

**వంతలు:**- ధం ధం ధరికిట ధరికిట ధరికిట ధరికిట థోం ॥

**వంతలు:-** అంటూ అమ్మానాన్నలూ చుట్ట పక్కాలూ ఇరుగు పొరుగులూ చెవిలో గీపెట్టి చెప్పినారు.

**వంతలు:-** అహఁ చెప్పినారు.

**వచనం:-** ఆడమళయాళం ముత్తయిదువలూ ముదు సేఁమ్మలూ చుట్టూ కూర్చొనీ మొత్తుకున్నారు.

**వంతలు:-** ఆఁ మొత్తుకున్నారు.

**వచనం:-** అయినా ఆ తల్లి - ఎవరు?

**వంతలు:-** ఆఁ ఎవరయ్యా?

**వచనం:-** ఆ భక్తురాలు వెంగమాంబ తల్లి ఏ మాత్రమూ చలించ కుండా వాళ్ల నేమీ అనకుండా ఏమన్నదయ్యా? అంటే...!

**వంత(1):-** ఆఁ, ఏమన్నదో సెలవివ్వండి స్వామీ!

**కథకుడు:-**(రాగాలాపన)

"జ్యోతి వెలుగు చున్నదమ్మా! - దాని- లోతు
తెలియరాదె కొమ్మా!
పాతాళగగన - కళాతీతమై సర్వ-భూతములందు
ప్రఖ్యాతిగ పరమాత్మ ॥జ్యోతి॥

ఎవరిచే చిక్కదో యమ్మా - దాని
విధమిట్టిదని - చెప్ప - రాదు గదమ్మా!
మహిమ తెలియ గూడదమ్మా! ॥జ్యోతి॥

ఎరుకలో ఎరుకైన దమ్మా! - సత్య
మెరిగే సాక్షియై యున్నదమ్మా!
పరమాణువై విశ్వ పరిపూర్ణముగ నాత్మ
నరహరి రూపమున ॥జ్యోతి॥

అంటూ తత్త్వం పాడింది సోదరా!

**వంత(1):-** ఆహాహా! ఎంత బ్రహ్మాండమైన తత్త్వం పాడిందయ్యా స్వామీ!

**వంత(2):-** వింటూంటే...ఇలానే ఆ తరిగొండకు వెళ్లిపోదామా అనిపిస్తూన్నదయ్యా!

**కథకుడు:-** ఆ తత్త్వం ఆ ఆడంగులకు అర్థంకాక, దీనికి పిచ్చి పట్టిందంటూ శాపనార్థాలు పెట్టి లేచిపోయారయ్యా!

**వంత(1):-** ఏమిటేమిటేమిటీ! నారాయణ! నారాయణ! భక్తురాలు వెంగమాంబకే పిచ్చి అంటారా!

**వంత(2):-** గోవింద! గోవింద! వాళ్లే పిచ్చోళ్లు! తప్పుతప్పు!

**కథకుడు:-** తప్పో ఒప్పో! ఇప్పుడు మరో ముప్పు ముంచుకు వచ్చిమీద పడింది.

**వంత(1):-** ముప్పా! అదేమిటి స్వామీ?

**కథకుడు:-** ఇంతలోనే ఒక దుర్వార్త వచ్చిందయ్యా నారగుంట పాళెం నుండీ.... (రాగం తీసి పలుకుతాడు)

**వంత(2):-** ఆఁ ఆఁ ఆఁ! దుర్వార్తా!? ఏమిటిది స్వామీ! గోవింద! గోవింద!! దుర్వార్తా?

**కథ కుడు:**-ఔను నాయనలారా! (ఖేదంతో రాగాలాపన)

"అందమైనా కుందనాల కొమ్మ - ఇల్లాలైనదీ
॥తందానో తానతందనాన॥
డెందమంతా సుందరి జూచీ - దిమ్మె గుల్ల బారిందీ ,,
ఎందుసేతో విందు సెయకా - పొందులేదూ
పొమ్మందీ ,,
ఆ-అరవింద నేత్రుడు-గోవిందుడే తన సామి-సామీ!
అన్నదీ

పదిమందిలో పరువు పోయెరా! ॥తాన తందానా॥
మగసిరికె మచ్చొచ్చి కూలెరా! ,,
నలుగురిలోనా - తలయెత్తి పోలేక॥తానతందానా॥
నవ్వుటాల బ్రతుకాయెరా! ,,
పిల్ల నెవ్వారివ్వరు - పిసుకూల బ్రతుకాయె
దీనికంటె సావె - మేలురా! ॥తందానో...తాన॥

**వచనం:**- అంటూ రోజూ...దిగులు పడీ..పడీ...పడీ..

**వంత(1):**- ఆఁ పడీ...పడీ...పడీ...ఏమైందయ్యో?

**వచనం:**- కృశించి కృశించి వేంకటాచలపతి ఒకరోజు హఠాత్తుగా కాలమై పోయాడురన్నా!.. .(రాగం)

**వంత(2):**- (దీనంగా) తందానో...తాన..తందనానా...॥తరికిట తరికిట॥

**కథ కుడు:**-అదయ్యా! దుర్వార్త! కృష్ణయ్య పంతులింటికి ఆ దుర్వార్తను పంపించినారు; ఎందుకో తెలుసా?

**వంత(1):**- నీవు చెప్పందే మాకెలా తెలుస్తుంది స్వామీ! (దరువు)

**కథకుడు**:-ఎందుకంటేనూ - వాళ్లు సద్విప్రోత్తములు కనుకా-

**వంత(2)**:- ఆహఁ!

**కథకుడు**:-సంప్రదాయం ఆచారం పాటించవలెను కనుక.

**వంత(1)**:- ఆహఁ!

**కథకుడు**:- ఆ వంశం ఆచారం ప్రకారం పదోరోజు ఇల్లాలి ముత్తయిదువ చిహ్నాలన్నీ తీసివేయించి, కురులు తీయించి, తెల్లచీర కట్టించీ..

**వంత(2)**:- రామరామ! రామ రామ! స్వామీ! ఇంక చెప్పవద్దయ్యా! అయమ్మ - ఆ భక్తురాలు అంత చిన్నవయసులోనే ముండమోయాలా! వద్దు స్వామీ ! వద్దు! - ఇంక చెప్పవద్దు!...

**కథకుడు**:- నాయనలారా! ఆనాటి సాంఘికాచారం అది! తప్పదు గాక తప్పదు. పాపం! ఊరు ఊరంతా వెంగమాంబ ఇంటివద్ద చేరీ - ఆమె వైపు జాలిగాచూస్తూ - చెప్పలేక - చెప్పలేక....

**వంత(1)**:- ఆ....చెప్పలేకా...

**కథకుడు**:- "తల్లీ! వెంగమ్మా! ఎంతఘోరం జరిగిపోయిందమ్మా? ఇంత చిన్నతనంలోనే ఎంత కష్టం వచ్చి పడిందమ్మా! ఇంక నీవిలా కట్టూ బొట్టులతో ముత్తయిదువలా తిరిగే వీలులేదమ్మా! ఎందుకంటే - నీ పెనిమిటి - వేంకటాచలపతి ఇక లేడమ్మో...ఓ ఓ ఓ ఓ..." అంటూ గొల్లుమన్నారయ్యా!

**వంత(2):-** పాపం! ఆ తల్లి వెంగమ్మ కూడా గొల్లుమనే వుంటుంది.

**కథకుడు:-** అలా జరిగితే అమె మహా భక్తురాలెలా అవుతుందిరో?...

**వంత(1):-** అరరరె! మరేం చేసిందయ్యారో?

**కథకుడు:-** ఏం చేసిందా? (చిరుతలు-గజ్జెలు-తంబుర లాడిస్తూ-చిందులు వేస్తూ)

"హరిహరీ! నారాయణా! - శ్రీతరిగొండ నారసింహా!
హరిహరీ! కమలాక్ష! - శ్రీశేషాచలవాసా!
చిన్ననాటే నన్ను నీకే - అర్పణము చేసితినీ
కన్నవారే కానలేకా - కట్టడీ చేసిరీ
సత్తు చిత్తూ అన్ని నీవే - నా సర్వమూ నీవు నీవే
చిత్తమంతా నిండి నీవే - స్వరమునంతా నిండి నీవే
నీవు శాశ్వత మూర్తివే! - నా మాంగల్య మెక్కడ
పోవునూ? శ్రీలక్ష్మీవర వేంకట నాథా! - బుద్ధి వీళ్లకు
చెప్పవే! ॥హరి॥

**వచనం:-** అంటూ తనకు వైధవ్యం లేదనీ, తన నాథుడు ఆ శ్రీనివాసుడేననీ ఖండితంగా చెప్పిందయ్యాలూ!

**వంత(2):-** అమ్మమ్మమ్మ! ఆ దినాలలోనే స్త్రీజాతి ఎదురు తిరిగిందన్నమాట.

**కథకుడు:-** ఉన్నమాట అదే కదా! పైగా తనకు ఆశేషాచలపతితో ఏనాడో మనువైయుంటే ఈ వెంకటాచలపతి ఎవరయ్యా నామెడలో తాళిగట్టను? దీనికి విలువెక్కడా! - అని దాడి చేసింది. ఊరు ఊరంతా

ముక్కున వేలేసుకున్నది. ఆచారం విడిచి అనాచారం చేస్తున్నదని లబలబ మొత్తుకున్నారు గ్రామ పెద్దలు.

**వంత(1):-** మరయితే వెంగమాంబ తల్లిదండ్రులు ఏం చేశారు!

**వంత(2):-** వెంగమాంబ ఏం చేసింది! వివరంగా చెప్పవయ్యా!

**కథ కుడు:-**(చిరుతలు వాయిస్తూ)“ఊరు ఊరే ఉలిపికట్టె అయి
- ఉసీ కొల్పిందీ. ॥తందానతాన॥
బ్రాహ్మలింటీ ఆడపడుచై - భ్రష్టు పట్టిందీ ,,
ఏమిరయ్యో! కృష్ణయ్యో! - ఏమి చేస్తావూ? ,,
వెంట అట్టే పెట్టుకుంటవ? - బైటి కీడ్చీ పంపుతావా?,,

**వచనం:-** అంటూ కృష్ణయ్య వెంట పడింది. ఊరి బ్రాహ్మణు లందరూ ఆ తల చెడిన ఆడది కురులతో అలానే మీ యింట వుంటే - నిన్ను వెలివేస్తామని బెదిరించారు.

**వంత(1):-** అయ్యయ్యయ్యో! ఎంత ఘోరం! ఎంత ఘోరం! మరయితే వెంగమాంబ తల్లి ఏం చేసిందయ్యా?

**వంత(2):-** ఏం చేసిందయ్యరో?...(రాగం)

**కథ కుడు:-**వెంగమాంబ అప్పుడేం చేసిందయ్యా అంటే...
“నావల్ల ఇంటోళ్లు - నానాక కష్టాలు
పడకూడదనుకుందిరా! ॥భళా!॥
నావల్ల నావాళ్లు - సంఘపీడకు - గురీ
కాకూడదనుకుందిరా! ॥భళా!॥
ఇంట నుంచగలేక - బయట పంపగలేక
కుమిలి యేడ్చే తల్లి - గుబులు కన్నాదీ...
నోరు విప్పగ లేక - బయట తిరుగా లేక

కుళ్లి యేడ్చే తండ్రి - చింత కన్నాదీ....
ఎవరికీ ఏంగానురా!..... సై
నాకెవరు కావాలిరా!..... సై
నాకు నీకూ దిక్కు
అందరికి పెదదిక్కు
తరిగొండ నరసింహుడేరా!...
నా తనువు నా మనువు నా మనసు నా సొగసు
నా పలుకు నా పిలుపు నా ఉలుకు - నా అలుపు
అన్నీని ఆస్వామివేరా! - అక్కడే నే వుండిపోతా॥

**వచనం:-** అంటూ ఒకరోజు తెల్లవారక మునుపే వెళ్లి ఆ తరిగొండ అక్ష్మీనరసింహస్వామి ఆలయమే నివాసంగా అక్కడే చేరిపోయిందాతల్లి! ఆతల్లి ఆమహాభక్తురాలు తరిగొండ వెంగమాంబ - అప్పుడేమైనదంటే..

**వంత(1):-** ఏమ్మయిందయ్యరో? ..(రాగం, దరువు)

**వచనం:-** అవూళ్లో బ్రాహ్మణులకూ, పాతతరం పెద్దలకూ వెంగమాంబ ఆ ఆలయంలో కూడా వుండడం ఇష్టంలేనిదయ్యింది. ఆమె నెట్టాగయినా అక్కడనుండి తరమాలనే ప్రయత్నాలు చేయసాగినారు.

**వంత(2):-** వీరి దుంపాతెగా - అంత వైరమెందుకయ్యా వాళ్లకూ?

**వచనం:-** వాళ్ల మాట నెగ్గలేదని! పాపం! కన్నకూతురు గనుక కృష్ణయ్య ఏమీచేయలేకా, ఏంచేయాలో తోచకా, బిడ్డకు ఎన్నెన్ని విధాలుగానో నచ్చచెప్పేవాడు. ఆతల్లి అన్నింటికీ బదులు చెప్పేది. అది వితండ వాదమని అందరూ అనుకునేవారు.

**వంత(1)**:- అయ్యా! వితండవాదం అంటే ఎట్లా వుండేదో సెలవియ్యండి సామీ!

**కథకుడు**:-చెబుతానయ్యలారా! ఆ తండ్రీ కూతుళ్లు ఇద్దరి మధ్యా వాదం ఎలా సాగిందో వినండీ! -- (రాగం)

"తల్లీ! నాబిడ్డా! వినవే - తరిగొండ
వెంగమాంబా! నువ్వు వినవే! ॥సైసై॥
అయ్య! తండ్రీ! - సెప్పవో
వినెడి తీరైతేను వింటాను. "
విప్రులామూ మనము - విప్రులామూ మనము
వింతవింతగ నుండరాదే-కూనా! "
నాలోని వింతేమి తండ్రీ! నను గన్న
నాతండ్రి! నావింత ఏమీ? "
మాంగల్యముంటేనె - ముత్తైదువే బిడ్డ!
అది లేక నువ్విధవరాలైతివే బిడ్డ! ॥సై॥
మగడు చచ్చిన కదా-నాతండ్రీ!
బిడ్డ - విధవరాలయ్యేను నాతండ్రీ! "
నీమగడు - నీమెడలా తాళిగట్టినవాడు
వెంకటాచలపతే - చచ్చెనే కూన! ॥సై॥
తాళిదీయక నువ్వు - వుంటీవె బిడ్డ! ,,
నీదెంత పొరబాటు - నాతండ్రీ! నా
మగడు తిరుమల నాథుడే తండ్రీ! ,,
అతని కెక్కడ చావు - నా తండ్రీ!
బుద్ధి లేదే నీకు - పాపిష్టిదానా! ,,

దేవుడూ మగడేంటె - ఉన్మాదీ?
చెప్పితే వినవయ్య - నా తండ్రీ!
శేషప్పడే మగడు నా తండ్రీ!
నాకు వైధవ్య మేడయ్య నా తండ్రీ?
॥తందానో తానతందనానా॥
॥తరికిట తరికిట తరికిటథో॥

**వచనం:-** ఆ విధంగా...

**వంత(1):-** అహఁ!

**వచనం:-** తనకు వైధవ్యమే రాలేదనీ - మీకే తెలివిలేక వెఱ్ఱి పల్కులు పల్కుతు వున్నారానీ వాదిన్తూవున్న వెంగమాంబను

**వంత(2):-** అహఁ!

**వచనం:-** కృష్ణయ్య మదనపల్లెలోని మహావేదాంతీ, గొప్పజ్ఞానీ అయిన రూపావతారం సుబ్రహ్మణ్యశాస్త్రుల వద్దకు తీసుకువెళ్లినాడు.

**వంత(1):-** అయనెవరయ్యా స్వామి...మధ్యా?

**కథకుడు:-** ఆ దినాలలో శాస్త్రులంటే గొప్పపేరు. ఎందరెందరికో వారు ఉపదేశం ఇచ్చేవారు. తత్త్వం బోధించేవారు.

**వంత(2):-** ఓహో!

**కథకుడు:-** అయన గారి వద్ద దించితేనన్నా వెంగమాంబ మారేనేమో ననీ...

**వంత(1):-** మారిందా? వారేం బోధించినారు?

**వంత(2)**:- ఈమేం అందుకొందీ!

**కథకుడు**:-ఆ శాస్త్రులవారు వెంగమాంబను అనేక ప్రశ్నలువేసి, ఆమెలో గొప్ప యోగజ్ఞానం వున్నదనీ, ఆమె పూర్వజన్మసంస్కారంతో అవతరించిన మహిళ అనీ గ్రహించినారు. మంత్రోపదేశం చేసి, యోగరహస్యాలు బోధించి, ఇంక తరించవమ్మా! - అని పంపించినారు.

**వంత(1)**:- ఎక్కడకు పంపించినారయ్యా?

**కథకుడు**:-ఎక్కడికో ఎందుకు పంపుతారు నాయనా! పోయిరావమ్మా! అని దీవించి పంపినారు. ఆ తల్లి మళ్లీ చక్కగా తరిగొండకే వచ్చింది. వస్తే..

**వంత(1)**:- ఆఁ ఏమైంది స్వామీ! ఏమయిందీ?

**కథకుడు**:-ఆ వూరివాళ్లు ఒకతాయంగా కష్టపెట్టినారా?

**వంత(2)**:- వీళ్లెక్కడి కాకులు స్వామీ! ఎప్పుడూ పొడుచుకు తినటమేనా వీళ్ల పనీ!

**వంత(1)**:- మళ్లీ ఏం చేసినారయ్యో? (రాగం)

**కథకుడు**:-(రాగంతీస్తూ)

"పిచ్చిదన్నారు - తిక్కదన్నారు
రాళ్లతో తన్నారురో! - తమ్ముడ!
రొంపి, పెండా చల్లినారురో! ॥తం॥
వెకిలి కూతలు కూసి - వెకిలి చేతలు చేసి
వెంటబడి అరిచారురో! - తమ్ముడ!
మంట పుట్టించారురో! ॥తం॥
పిల్లలంతా గుంపు చేరీ ॥తం॥

జొల్లుమాటల కంపు నింపీ ॥తం॥
చిల్లరా చేష్టలూ చేశారురో! ॥తం॥
పొల్లు నిందలు మీద మోపారురో! ॥తం॥

**వచనం:-** అయినా ఆ మహాతల్లి ఆ లక్ష్మీ నరసింహునే ధ్యానిస్తూ మౌనంగా ఎవరినీ ఏమీ పల్లెత్తు మాటా అనకుండా వెళ్లి-

**వంత(1):-** వెళ్లి?

**వంత(2):-** ఎక్కడకు వెళ్లి?

**వచనం:-** ఆ లక్ష్మీనరసింహస్వామి గుడికే - వెళ్లి! ఆ గుడిలో ఆంజనేయుని విగ్రహం మాటున కూర్చొని యోగసమాధిలో ఒళ్లు తెలియకుండా మునిగి పోయేది.

**వంత(1):-** ఔరా!?

**వచనం:-** ఆ యోగబలం ఎలాంటిదో తెలుసా సోదరా!

**వంత(2):-** నీవు చెప్పందే మాకెలా తెలుస్తుందయ్యా!

**కథకుడు:-** అయితే వినండయ్యలారా!
ఆ యమ్మ గుళ్లో ఆ హనుమంతుని విగ్రహంమాటున వుండేదంటినా?

**వంత(1):-** అంటిరి కదా!

**కథకుడు:-** ఒక రోజున ఆ గుళ్లో పూజచేసే అర్చక స్వామి విగ్రహాలు శుభ్రంచేస్తూ, ఆంజనేయులవారికి అలంకారం చేద్దామని ........

**వంతలు:-** అనీ ....... (దరువు)

**కథ కుడు:-**విగ్రహంవద్దకు వెళ్లాడు. ఆ వెనుక తల్లి కూర్చొనుండటం గమనించాడు. "ఆ! పాపీ! ఇక్కడ వున్నావా? స్వామి వారి సన్నిధినే అ పవిత్రం చేస్తావుటే? అంటూ......

**వంతలు:-** అంటూ....ఏం గంటుపెట్టినాడయ్యో?

**కథ కుడు:-**ఆమె తలవెండ్రుకలు పట్టి గట్టిగా లాగినాడయ్యలూ!..

**వంతలు:-** ఆఁ .... ఔరా! అయ్యో! ఏమైందయ్యో!

**కథ కుడు:-**అంతే ఆ పరమయోగిని.....మా తల్లి కళ్లు తెరిచింది. ఆ పూజారికి ఉగ్ర నరసింహం ఆమెలో కనబడినాడు. అంతే.....

**వంతలు:-** (నవ్వుతూ) బలె బలె బలే! గోచీ వూడదీసుకొని పారిపోయుంటాడు...... .అంతేనా?

**కథ కుడు:-**తధిగిణ థా! అంతే మతి! ఆమె తపశ్శక్తి అలాంటిది! అంతేకాదా! (చిరుతలు వాయిస్తూ) - రాగం.

"యోగబలముచేత - ఆశుకవితల నల్లెరా సోదరా!
శతక మొక్కటి చెప్పెరా! సోదరా! ॥భళా!॥

శ్రీనృసింహుని లీల-యక్షగానము చేసెరా! సోదరా!
శివవిలాసము - కూర్చెరా! - సోదరా! ॥భళా!॥

రాయచోటీ వీరభద్రస్వామికి - దాన్ని
అంకితమ్మొ చేసెరా!" ॥భళాభళి!॥

**వచనం:-** అంతేకాదురో రన్నా!

**వంత(1):-** ఇంకేమి కలదన్నా?

**వంత(2):-** ఆసాంతం చెప్పవన్నా ! (దరువు)

**కథకుడు:-**"పలువురూ తః ఋవలూ గేలిసేయుచునున్న
॥తానతందనా॥
చిలవలూ పలవలూ కతలు చెప్పుచునున్న "
కవితయే తపముగా కాన్పించెరా - తల్లికీ "
రాజయోగము వ్రాసెరా - సోదరా! "
నరసింహస్వామికే - అంకితమ్మూ చేసెరా
॥తరికిటతరికిట తా॥

**వచనం:-** ఇంకా ఏమంటేనూ ..

**వంతలు:-** ఆ ( ..

**కథకుడు:-**"బాలకృష్ణుని కథను - యక్షగానము చేసి - ॥తమ్ముడూ॥
ఆ కృష్ణమూర్తికే అంకితమ్మూ చేసి -
'ఆంధ్రమీరా' ఆయెరా! - తమ్ముడా!
ఆనందమున మున్గెరా! ॥తరికిట తరికిట॥

**వచనం:-** ఇంతగొప్పగా ఆ మహాతల్లి

**వంతలు:-** ఆహా( ।

**వచనం:-** పరమ భక్తురాలు తనకయితలతో పాటలతో తత్వాలతో జగాన్ని మరచి, పరబ్రహ్మస్వరూపమైన పరంధాముడైన శ్రీలక్ష్మీనరసింహుని యందే లీనమై వుండగా --

**వంత (1):-** వుండగా - ఎవరికేం మండెనో తెలపండీ! --

**కథకుడు:-** సనాతన బ్రాహ్మణులూ, గ్రామపెద్దలూ అందరూ ఒకటై ఒక నిర్ణయం చేసికొనీ ..

**వంత (2):-** ఏమిటీ..నిర్ణయమే..? ఏమనీ?

**కథకుడు:-** ఒక క్షురకుని వెంటబెట్టుకొని కృష్ణయ్య యింటి ముందు గుమికూడినారయ్యా!

**వంత(1):-** ఎందుకయ్యా...?

**కథకుడు:-** కృష్ణయ్యను ఒప్పించి, బలవంతముగా వెంగమాంబ కురులు తీయించాలన్నది వాళ్ల పంతము సోదరా!

**వంత(2):-** అయ్యయ్యయ్యో! ఇదేమి పంతము సామీ.. !

**కథకుడు:-** ఆ మంద గొంతుకు ఎదురాడే ధైర్యంలేక కృష్ణయ్య గంగిరెద్దులా తలూపినాడు; లోలోన కుమిలిపోయినాడు. అందరూ కలిసి గుడిముందుకు కదిలినారయ్యా!

**వంత(1):-** తరువాతేమయిందయ్యరో?... (రాగంతీసి)

**కథకుడు:-** (ఆలాపన)

"రావె!ఓ అనాచారి! - నంగనాచి వెంగమా!
రావె! ఓ ఉన్మాదిని! - దురాచారి దుండగీ!"

**వంతలు:-** తందనె తానా - తందనె తానా।

**కథకుడు:-** "కట్టుబాటు కాదనీ - కట్టుబొట్టు తీయననీ
పట్టుబట్టి ముత్తయిదువ నంటావా పిశాచీ? ॥తం॥

దేవుడెట్టు మగడాయే? - నీవేమీ దేవతవా?
తాళెప్పుడు కట్టాడే? - తంపులమారి దయ్యమా? ॥తం॥

కురులు తీయనంటావే! - కులుకుదా మనుకుందువ?
ఏం భక్తే నీ భక్తి? - ఉత్తనాటకాల పిచ్చి" ॥తం॥

**వచనం:-** అంటూ గేలిచేస్తూ వెంగమాంబను గుడిలోనుండి బయటకు రమ్మని కేకలు వేసినారు. ఆ తల్లి.. పరమభక్తురాలు - మౌనంగా బయటకు వచ్చి నిలచింది...అప్పుడూ..

**వంత(2):-** ఆఁ ఆఁ అప్పుడేమయిందయ్యా?

**కథకుడు:-** వచ్చిన పెద్దలు తమ్ముడా! ॥సై॥
పిచ్చిదాని తలగొరగరా! ॥సై॥
అంటూ క్షురకుని త్రోసినారురా!
నాపి బిగుసుకు పోయి తూలెరా! ॥సై-సై-సైరా!॥

**వచనం:-** క్షురకుణ్ణి ఆ మహాతల్లి ముందుకు నెట్టినా, పోలేక తూలి బోర్లపడినాడు. తటాల్న తలెత్తి ఆతల్లి దివ్య తేజోమయ స్వరూపం చూసి - మళ్లీ లేచి సాష్టాంగప్రణామం చేసి.... చేతులు జోడించి...

**వంత(1):-** జోడించీ...

**కథకుడు:-** "తల్లీ! సైరింపుమమ్మా! - తల్లీ! సైరింపవే!"

**వంతలు:-** తానో తందనా తానానో॥

**కథకుడు:-**"శక్తివే మాతల్లి! నీవూ - భక్తితో దండాల నిడుదూ!
ముక్తి వచ్చే మార్గమేదో - రక్తితో నా కెరుకసేయే!
తల్లీ! సైరింపుమమ్మా-తల్లీ! సైరింపవే!" ॥తం॥

**వచనం:-** అంటూ దండాలు పెట్టి - తిరిగిచూడకుండా ఒకటే పరుగు లంకించుకొనీ-- పారిపోయినాడు.

**వంతలు:-** (ఆనందంతో) బలెబలెబలెబలె! - మా బాగా జరిగింది-
తననతననననన-

**వచనం:-** మిగిలిన వాళ్లకి ఏమి దిక్కుతోచలేదు. అంతలోనే వాళ్లందరి శరీరాలు మంటదీసుకున్నాయి. అంతే -- ఒక్కడూ అక్కడ ఉండకుండా పరుగో--పరుగు--

**వంతలు:-** "అమ్మా! అబ్బా! మంట! మంట! అంటూ..

**కథకుడు:-** అంతే సోదరా! వెంగమాంబ; తండ్రికి దండం పెట్టింది అతడే భావమూ ముఖాన చూపకుండా మౌనంగా యింటికి కదిలిపోయినాడు. వెంగమాంబ మళ్లీ గుళ్లోకి వెళ్లి ధ్యానంలో కూచుంది. అయితే-

**వంత(1):-** అబ్బా! మళ్లీ ఈ అయితే ఏమి స్వామి?
**వంత(2):-** దానిని వింటేనే మాకు కంపరమయ్యో! ---(రాగం)

**కథకుడు:-** ఊరిలోని విప్రశిఖామణులు ఊరుకోలేదు నాయనా!

**వంత(1):-** మళ్లీ ఏం పోగాలం వచ్చిందీ--
**వంత(2):-** ఏం చేసినారో తెల్పండి! మహాప్రభో!

**కథకుడు:-** (రాగాలాపన)

"సకలవేదములు - తెలిసినవాడుర!
పుష్పగిరి స్వాములూ ॥తందానతానా॥
దేశసంచారాన - ఊరూరు తిరిగీ
తిరుమలా - వచ్చాడురా! ॥
విషయమ్ము తెలిసిన - విప్రనాయకు లెల్ల
విన్నపము - పంపారురా! ॥
"స్వాములూ! మీరలు - తప్పకుండా మా
తరిగొండ రావాలనీ" ॥

వచ్చినారంటేను - వల్లమాలిన వింత
రోగమ్ము చూపేమనీ ॥తందానతానా॥
ఆ రోగి రుజ మాన్ప - మీరే సమర్థులు
తప్పక రావాలనీ ॥
"తరిగిట తరిగిట తరిగిట తోం"

**వచనం:-** ఆవిధంగా పంపిన విన్నపం చూచి ఒక రోజు పుష్పగిరి స్వాములవారు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీతీర్థుల వారు-

**వంత(2):-** ఏమిటేమిటీ? - అవినవ నవ దండ బండ ---

**కథకుడు:-**(నవ్వుతూ) నవదండాబండా కాదు నాయనా! అది స్వామివారి బిరుదం. మీకు నోరుతిరగదు, కానీ. అదంతా ఎందుకులే! స్వాముల వారు తరిగొండలో విడిది చేశారు. ఊరిబాపనయ్య లందరూ కలిసి వెంగమాంబ మీద చెప్పవలసినన్ని పితూరీలూ చెప్పినారు.

**వంత(1):-** ఎవరిమీదా? ఆ తల్లిమీద! వెంగమాంబమీద? ఏమిటీ--? పితూరీలు? ఆఁ! ఏమని చెప్పినారు స్వామీ?

**కథకుడు:-**"దండాలు స్వామీ! మీకు దండాలు! దండాలు!"

**వంత(1):-** "దండాలు! దండాలు!"

**కథకుడు:-** "మీ అండాదండాలు మాకు - ఉండాలె నిండుగాను"
**వంత(2):-** ఉండాలె నిండుగాను.

**కథకుడు:-**"మా వూరిలో వుంది - మాయదారి మల్లి ఒకతె"

**వంత(1)**:- మాయదారి మల్లి ఒకతె

**కథకుడు**:- "మొగుడు చచ్చినా కురులు - తీయతీయనంటాది"
**వంత(2)**:- తీయతీయనంటాది

**కథకుడు**:-"బాపనోళ్ల కొంప బుట్టి - నీతి మాలుతానంటాది"
**వంత(1)**:- నీతి మాలుతానంటాది

**కథకుడు**:- "మీరే పిలిపించాలె దాన్ని - కురులు బోడి చెయ్యాలె"
**వంత(2)**:- కురులు బోడి చెయ్యాలె

**వంతలు**:- "తందనానా - తాన తందనానా" ॥తంద॥

**వచనం**:- అంటూ గుంపుకట్టి ఏకరువు పెట్టినారు.

**వంత(1)**:- పెట్టినారు సరే! జరిగిందేమిటంటా?

**కథకుడు**:-స్వామి వారు విడిది చేసిన చోటికి వెంగమాంబను పిలిపించినారు. పెద్దలమాట జవదాటరాదని ఆతల్లి వినయంగా వచ్చింది. వచ్చి....

**వంత(2)**:- వచ్చి--? ఏమయ్యిందేమిటీ?

**కథకుడు**:- ఆడది... అందునా మగడు చచ్చినది - చచ్చినా కురులు తీయని అనాచారి అనీ -

**వంత(1)**:- అనీ--

**కథకుడు**:- స్వాములవారు తనకూ ఆమెకూ మధ్య ఓ తెరగట్టించి నారయ్యా!

**వంత(2)**:- తెర ఎందుకయ్యా?

**కథకుడు**:- అదే మాట వెంగమాంబ -- ఆ మహాతల్లీ ఇలా అడిగిందయ్యరో! --- (రాగాలాపన)

"ఇంద్రియంబుల గెలిచినారూ ॥తందాన॥
ఇంద్రపదవికి సాటి మీరూ ”
సుందర్రైతేనేమో సౌరూ ॥తందాన॥
సందేహపడనేల మీరూ? ”
కాకున్న మనమధ్య ఈ తెరా ఏమీ? ”
మనసు సొగసున వ్రాలునేమీ?" ”

**వచనం:-** అంటూ ఖరాఖండీగా ప్రశ్నించిదయ్యా స్వాములను?

**వంతలు:-** భళా! వెంగమతల్లీ! భళా!

**వచనం:-** స్వాములవారు సిగ్గు పడినారు. శిష్యుల చేత తెర దీయించినారు. అయినా వెంగమాంబవైపు తలెత్తి చూడ లేక కనులు మూసికొనే, "తల్లీ! పతి విగత జీవుడయితే పడతి కురులతో నుండుట విప్ర సంప్రదాయ విరుద్ధము కాదా?" అనడిగారు! అప్పుడా తల్లి--

**వంత(1):-** ఆఁ! ఆ తల్లి ఏమన్నదయ్యా?

**వచనం:-** "కురుల నేల తొలగించవలె స్వామీ?" అని అడిగింది.
**వంత(2):-** స్వాములేమన్నారు స్వామీ?

**వచనం:-** వయసు చిన్నదానివి! కురుల సొగసు ఎంతటి నీచా లోచనలకైనా పురికొల్పును కదా తల్లీ! - అని అడిగారు

**వంత(1):-** ఆమే ఏమన్నాదయ్యరో! -- (రాగం)

**వచనం:-** "తలలు బోడులయిన తలపులు బోడులా?
చెప్పరయ్య!మీరు - చెలువు మీర!" అన్నది.

**వంత(2):-** భళా! బహుచక్కని సమాధానం. ఇనుప పంజరంలో పెట్టినా ఇంతు లనుకుంటే వింతలెన్ని పుట్టవు మరి?

**వచనం:-** అంతే--స్వామివారు మౌనం వహించినారు. అప్పుడు

కదా తలెత్తి వెంగమాంబ ముఖంలోకి తేరిపార చూచినారు!

**వంత(1):-** ఆహాఁ!

**వచనం:-** ఆముఖంలోని ప్రశాంతత, నెమ్మదితనం, నిశ్చలత్వం, ఒక అతీతమైన కాంతిరేఖ చూచీ....

**వంత(2):-** చూచీ--

**వచనం:-** 'నీ తత్త్వమూ, తర్కమూ బాగున్నాయి తల్లీ! కానీ, పెద్దలైన సాధు జనులను వందనాలతో ఆదరించవలెననే మాట మరచితివే! ఇది యే తర్కానికి నిలుస్తుందమ్మా? - అని అడిగినాడు.

అప్పుడా తల్లి పరమయోగిని వెంగమాంబ "స్వామీ! మీరు ఆ పీఠంనుండి కొంచెం ఈ వలకు రండి!'' అన్నది. అందుకు స్వామి మనన్సు చివుక్కుమన్నది. అయినా ఆ స్వామి వారు వెంగమాంబ కోరినట్లే పీఠం నుండి దిగి అల్లంత చేరువలో నిలువబడినాడు.

అప్పుడు ఆతల్లి రెండు చేతులూ జోడించి తనయిలవేల్పైన తరిగొండ ధా ముణ్ణి మనసారా ధ్యానిస్తూ స్వాములవారి సింహాసనానికి వందనం చేసిందయ్యరో!......

వంతలు:- ఆఁ....... అప్పుడేమయిందంటా?

కథకుడు:- వెంటనే ఆ పీఠంసింహగర్జన లాంటి శబ్దంతో పాటు తగులబడి పోయిందిరన్నా!

వంతలు:- (సంతోషంతో) తధిగిణతోం...తధిగిణతోం... మరి సాములేమన్నారో?

వచనం:- 'అమ్మా! తల్లీ! నీవు ప్రహ్లాదాంశతో అవతరించిన గొప్పభక్తురాలివి! నువ్వు సామాన్యురాలివి కావు! నీ లోని అచంచల నృసింహభక్తే నీవివేకానికి తోడు తల్లీ!'- అంటూ రెండు చేతులు జోడించాడు. ఆ తల్లిని 'లౌకికాచారాలకు అతీతురాలయిన పరమయోగిని!'- అని ప్రశంసించినాడు.

**వంత(1):-** ఆఁ అప్పుడేమయిందేమిటి?

**కథకుడు:-**అక్కడ చేరిన బ్రాహ్మలంతా గగ్గోలుపెట్టినారయ్యా! ఆ గగ్గోలు చూచి--

**వంత(2):-** ఆఁ...చూచీ...?

**కథకుడు:-** ఆ తల్లి వెంగమాంబ...

**వంత(1):-** ఆ... తల్లి వెంగమాంబ?

**కథకుడు:-** ఏమన్నదయ్యా వారితో నంటే....!

**వంత(2):-** ఏమన్నదయ్యో?....(రాగం)

**కథకుడు:-** (ఆలాపన)

"బ్రహ్మమేదో తెలుపరయ్యా! - బ్రాహ్మణులారా?
పరబ్రహ్మమేదో తెలుపరయ్యా! - బ్రాహ్మణులారా?

బ్రహ్మమేదో తెలుపరయ్యా! - భ్రాంతిలేక జీవునకూ
కర్మరహితమైన మోక్ష - గతికి పొయ్యేటందుకూ

నిర్మలాంతః కరణులగుచు - 'నిత్యం ఏకాక్షరం పర
బ్రహ్మసత్యం' బను శ్రుతి మీ - రెరిగినందుకు

రేపు మాపు సంధ్యవార్చి - రేచించి ఓంకారమందు
'ఆపోజ్యోతిః హంసోఽహం - స్వాహేతి'యని మీరెరిగినందుకు

నిండు వేడుకతో తరి - గొండ భ్రమరాంబ ఊర్ధ్వ
కుండలి ప్రణవమహత్త్వం - సుబ్రహ్మణ్యగురుడని
మీ రెరిగినందుకు"

అంటూ వారినిత్యానుష్ఠాన రీతిని వారికే గుర్తుచేసీ, అంత గొప్ప వారైనందుకు పరబ్రహ్మమేదో తెలియదా! తెలిసే వుంటే ఈ 'సడి' ఎందుకయ్యా లేవదీస్తారూ?' అని మొహాన కడిగి పారవేసిందయ్యాలూ!

**వంత(1):-** ఆహాఁ! గొప్ప వాదున్న తల్లే!....

**వంత(2):-** ఎంత చక్కగా చెప్పింది మా తల్లే!

**కథకుడు:-** అంతే కాదు... ఆమెకు... ఆ తల్లికి... పీఠాధిపతులన్నా చిన్న చూపేమి లేదు తమ్ములారా?

**వంత(1):-** నిజమే!?

**కథ కుడు:-**నిజంగానూ.... ఎప్పుడయితే ఆ స్వాములవారు ఆమెను 'నీవు గొప్ప దానివి తల్లీ!'అంటూ ఒప్పుకొని, "నీ మార్గాన నీవు నిరభ్యంతరంగా పయనించు తల్లీ!" అన్నాడో....

**వంత(2):-** అన్నాడో...!

**కథకుడు:-** ఆతల్లీ...వెంగమాంబ...ఆ స్వాములవారికి దండాలు పెట్టి-

**వంత(1):-** పెట్టీ... (దరువు)

**కథకుడు:-** (తాళం వాయిస్తూ)

"శంకరాచార్య గురుని - సన్నుతింపరే!
నిష్కళంక పరమయోగ - మభ్యసింపరే!
లలిత నీలతోయదమున - నిలిచి మెరయరే!
మూడు రెండ్లు దాటి పైన - మేడ జేరరే!
పోడిమిగను ముక్తికాంత - పోడిమరయరే!"

అంటూ ఆ పెద్దస్వాములవారినీ ప్రస్తుతించింది నాయనలారా!

**వంత(2):-** ఆహాఁ! ఏమి ఆ వినయ స్వభావము!

**వచనం:-** అప్పుడా స్వాములవా రామెతో...

**వంత(1):-** ఆఁ.. ఆ తల్లితో - మళ్లీ ఏమైనా అన్నాడా!

**వచనం:-** కాదు నాయనా! అనడం కాదు....

**వంత(2):-** మరేఁ?

**వచనం:-** } చెప్పడం..

**వంత(1):-** } ఏమనీ...

**కథకుడు:-** 'అమ్మా! నీవింక ఈ గోలగుంపు మధ్య నుండటం మంచిది కాదమ్మా! ఆ ఏడుకొండలవాని సాన్నిధ్యంలో నీకు ఈ పీడలుండవుగాక!'

**వంత(2):-** ఔను.. ఉండవు గాక, వుండవు...

**కథకుడు:-** వెళ్లి ఆ స్వామి సన్నిధి చేరుకొమ్మని ఉపదేశించి తరలి పోయినాడు.

**వంత(1):-** అయితే... మరి... మన తరిగొండ వెంగమాంబ ఆ ఏడుకొండలవాని సన్నిధికి...

**వంత(2):-** చేరిందా?.....(రాగం)

**కథకుడు:-** ఆఁ! పోకుండా వుంటుందా! ఆ తల్లి కూడా మనసులో గట్టిగా నిశ్చయించుకొని తిరుమలకు కదిలిందయ్యారో!....

**కథ కుడు**

**వంతలు** :-"మంగళం! మంగళం!
కృష్ణా! కృష్ణా! మంగళం! మంగళం!
లాలిత కృపాలవాల! వినత సూరిజాల!
కనకరుచిర చేలా!
శ్రీలోల! మోహనలీల! సత్యవిశాల!
నీలవర్ణ! బాలగోపాల! మంగళం! మంగళం!

------- **3వ భాగము సమాప్తం** -------



## 4వ భాగము

**కథకుడు:-** (చిరుతలు వాయిస్తూ)
"వినరా తమ్ముడ! వీనుల విందవు
వింతచరిత నేడూ.."

**వంతలు:-** "తందాన తాన"

**కథకుడు:-** సొంతవారి చెంత - వంతల పాలయిన
ఇంతి చరిత నేడూ... ॥తం॥
వెక్కిరింతలకు - కక్కసింతలకు
స్రుక్కిపోయినట్టి - సుదతికత నేడూ "
దేవుని పాదాల - దీటుగ కూచున్న
చిత్తశాంతిలేక - చింతిల్లి పోయిన
చిన్నమ్మ కత నేడూ "
స్వామివా రుపదేశ మతికి పోగా - మతికి
వెంకన్న పాదాల - వాలంగ నేగిన -
వనిత కత నేడూ "
"తరికిట తరికిట తరికిట థా"

**వచనం:-** పుష్పగిరి స్వాములవారు చెప్పిన మాటలూ, తరిగొండలో దేవళములోనైనా స్తిమితంగా వుండేందుకు వీలులేని పొరుగువాళ్ల కూతలూ... ఆతల్లిని... ఎవరిని?

**వంత(1):-** ఆ తల్లి... వెంగమాంబను...

**వచనం:-** ఇంక ఒక్కక్షణమైనా...తరిగొండలో ఉండనీయలేదు.

**వంత(2):-** లేదు.

**వచనం:-** వెంటనే ఆ తల్లి తరిగొండ విడిచింది.

**వంత(1):-** విడిచింది- (దరువు)

**వచనం:-** అడవి దారుల వెంట... ఒంటరిగా కాలినడకన తిరుమలకు బయలుదేరింది నాయనా!

**వంత(2):-** అయ్యో! ఆడకూతురు... అందునా ఒంటరిగా... ఎన్నికష్టాలు పడ్డదో కదా?

**వచనం:-** ఔను నాయనా! కష్టాలే! కానీ...

**వంత(1):-** ఆఁ...కానీ....

**వచనం:-** ఆ తిరుమల వెంకన్ననే మనసారా నమ్మి నడిచే వాళ్లకు అడవు లేమి! ఇడుము లేమి? నాయనా!

**వంత(2):-** మరయితే ఎట్లా బయలుదేరిందయ్యా?

**కథకుడు:-** వినండి నాయనలారా! (రాగం)

"తరిగొండ లక్ష్మి - నారసింహుని నమ్మి-
తరలిపోయినాదీ - ॥తం॥
తిరుమలా శ్రీవేంకటేశ్వరుని - నెర నమ్మి
తరలిపోయినాదీ "
ఇదె దారియని కాని - అదె దారి యనికాని
తెలియదయ్య తల్లికీ "
రాళ్ల రప్పల బాట - ముళ్లడొంకల బాట
అట్టె నడిచినాదయ్యో! "

**వంత(1):-** (దీనంగా) "తందానో...తందాన....దేవనందనానో"

**వంత(2):-** "తంద...నానో....దేవ...నందనానా"

**కథకుడు:-** "పొలాల వెంటా - బంజర్లవెంటా
తుప్పల తిప్పల దారుల వెంటా...

**వంతలు:-** 'దారుల వెంటా'

**కథకుడు:-** "చిటిచిట్టడవీ - పొటిపొట్టడవీ
గుట్టలమిట్టల వాగుల వెంటా

**వంతలు:-** 'వాగుల వెంట'

**కథకుడు:-** "తల్లి వెంగమాంబ - తలపులో తరిగొండ
నారసింహునె నమ్మి - నడచిందిరో!
వేంకటేశ్వరు నమ్మి - నడచిందిరో!" ॥తం॥
"తరికట తరికిట తరికిట ధాధాధా"

**వచనం:-** ఆవిధంగా అడవుల్లో మడవల్లో నడచి నడచి అలసి సొలసి తల్లి వెంగమాంబ నీరసించి... ఇంక ఒక్క అడుగూ...

**వంత(1):-** ఒక్కటంటే ఒక్కఅడుగూ

**వచనం:-** వేయలేక....దగ గొని కారడవి మధ్యలో నిలిచింది.

**వంత(2):-** ఆహాఁ! నిలిచిపోయిందండీ!

**వచనం:-** ఔన్నాయనా! అది "సందెకావు మొగలిపెంట" అనే కోన నాయనాలారా!

**వంత(1):-** కోనలో ఆతల్లికూన విలవిలలాడిపోయిందా నాయనా?

**కథకుడు:-** లేదు నాయనా! దిక్కులేని వారికి దేవుడే దిక్కుకదా!

**వంత(2):-** కదా!

**కథకుడు:-** ఆతల్లి... ఆ మహాభక్తురాలు తరిగొండ వెంగమాంబ భాగ్యవశాన అక్కడ...

**వంతలు:-** ఆఁఆఁ...అక్కడా? ఏమయిందయ్యా!

**కథకుడు:-** ఒక... ఆంజనేయస్వామి విగ్రహం కనబడింది...

**వంత(1):-** ఆహాఁ! అహో! జై వీరాంజనేయస్వామీ!
**(2):-** జై! భజరంగబలీ!

**కథకుడు:-**ఆ తల్లి - ఆ మందిరాన్ని చూచింది. అక్కడే ఆ సందెకావు సమీపంలోని చెరువులో చల్లనినీళ్లతో కాళ్లూ ముఖమూ శుభ్రం చేసుకొంది. కడుపునిండా ఆ చల్లని నీళ్లు త్రాగింది. ఆంజనేయస్వామి విగ్రహం ముందు ధ్యానంలో కూర్చుంది. అంతే...

**వంత(1):-** అంతేనా? అంతేనంటే?
**(2):-** అంతేనా? తందనానా?

**కథకుడు:-** అంతే అంటే... ఆమె తన ఒళ్లు తానే మరచి తపస్సులోకి పోయింది నాయనా! ఆమె నిశ్చలభక్తి అటువంటిది. ఆ తపోముద్రలో...

**వంత(1):-** ఆఁఆఁ! ఏముద్దరలో...

**కథకుడు:**-తపోముద్ర నాయనా! ఆ తపోముద్రలో ఆ ఏడుకొం డలవాడు ఆమెకు దర్శనమిచ్చినాడు. తన వద్దకే రమ్మని ఆదేశించినాడు నాయనా!

**వంత(2):**- ఆహాఁ! ఏమి ఆ తల్లి భాగ్యం!

**కథకుడు:**- వెంటనే కళ్లు తెరచిన వెంగమాంబ తన జీవితం ధన్యమైపోయిందని సంబరపడిపోతూ... ఇక ఎలాంటి అలుపూ ఆయాసమూ తెలియకుండా చక్కగా ఆ తిరుమల శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి చేరుకొన్నది నాయనా!

**వంతలు:**- "తరికిట తరికిట తరికిట ధోం ధోం ధనానా"

**వచనం:**- ఆ గుళ్లూ, గోపురాలూ చూడగానే ఆయమ్మ భక్తి ఆవేశాలతో కదిలిపోయింది. ఒక్కక్షణం ఉలుకూ పలుకూ లేకుండా ఆ స్వామి ప్రధాన గోపురం ముందే నిలబడిపోయింది. ఆమె తన్మయత్వం చూచిన భక్తులు ఆమె ఎవరో పరమ భక్తురాలని ఆమె చుట్టూ గుమి కూడి నిలబడి ఆమె వైపే చూడసాగినారు నాయనా!

**వంత(1):**- బలెబలె! మరీ బాగుంది!

**వచనం:**- క్షణంలోనే తెప్పరిల్లుకుందామె.

**వంత(2):**- ఆఁ తెప్పరిల్లీ....?

**కథకుడు:**-(ఆలాపన) ఆఁ...ఒకచక్కని పద్యం... ఆశువుగా అదిన్ని చెప్పిందయ్యా ఆ తల్లి....!

**వంత(1):-** ఏమిటీ! పాసుగానా?

**వంత(2):-** పద్యం చెప్పిందా ఏదీ వినిపించవయ్యా!

**కథకుడు:-** వినిపిస్తాను నాయనా! ఆశువుగా అంటేనూ... అప్పటికప్పుడే మనసులో అల్లుకొని పద్యం చెప్పిందని.

**వంతలు:-** ఆహాఁ! అదా ఎదీ మరి వినిపించూ...

**కథకుడు:-** వినండి! నాయనా!

"శృంగారరాయని చెలువుమీరిన కొండ
ఫణిరాజు పేరిటి పసిడి కొండ;
ఘోరపాపమణంచు కోనేర్లుగల కొండ
తలచిన మోక్షంబు తగులు కొండ;
చిలుకలు కోయిలల్ చెలగి కూసెడి కొండ
మృగజాతి కోట్లెల్ల మెలగు కొండ;
పుష్పజాతుల విష్ణుఁ బూజింపగల కొండ
కల్పవృక్షము లైదు కలుగు కొండ;
అమరవరులకు ఆధారమైన కొండ,
ఆళువార్లకు ప్రత్యక్షమైన కొండ,
అలరజూచిన బ్రహ్మాండమైన కొండ,
ఏను కనుగొంటి శ్రీవేంకటేశు కొండ."

**వంత(1):-** ఆహా! ఎంతబాగుందయ్యా పద్యం!

**వంత(2):-** ఆహాహా! నిజమయ్యా! అక్కడ అందరూ గుమిగూడి వినే వుంటారు కదయ్యా?

**కథకుడు:-** ఎందుకు వినరయ్యలారా! అప్పటికే ఆతల్లి పరవశించి నిలిచివుండగా చుట్టూ చేరివున్న

యాత్రికులు, స్థానికులు ఆమె పాడినతీరునకు ముగ్ధులై అక్కడే నిలబడిపోయి కళ్లూ చెవులూ అప్పగించి అలానే చూస్తూ వుండి పోయినారు. ఎవరో ఈభక్తురాలు! ఈ కవయిత్రి! - అంటూ ముక్కున వేలేసుకున్నారు.

**కథ కుడు**:-ఆ రాత్రి వెంగమ్మకు శ్రీనివాసస్వామి కలలో కానిపించి 'అలమేలుమంగ అనుగ్రహిస్తే నీవు ఇక్కడ - అంటే ఈ తిరుమలక్షేత్రంలో జీవితాన్ని కొనసాగించవచ్చు' - అని సూచించినాడట! అందువల్ల ఆ మరుసటిరోజు ఉదయాన్నే వెంగమాంబ గుడికి వెళ్లి శ్రీస్వామివారి వక్షఃస్థలంలో నెలకొనివున్న అలమేల్మంగాబను ఇలా కీర్తించిందయ్యా!

"అమ్మా! నే నిందుండుదు నటవే?
శ్రీ అలమేల్మంగ! - నన్నాదరించేవటవే?
అదియేమోకాని - నీవిభుడు నిన్నడిగి
నన్నిందుండుమని - చెప్పినాడూ...
సదయదృష్టిని నన్నుచూడూ...
సద్గతి గోరుచు నేనిందుండే నిపుడూ॥"
అంటూ ఆ అమ్మను కీర్తించిందయ్యలారా!

**వంత(1)**:- ఆహా! ఆ తల్లి పద్యం చెప్పినా, పాట చెప్పినా ఎంత కమ్మగా వుంటుందయ్యా!

**కథ కుడు**:-అప్పుడు...........

**వంత(1)**:- ఆ.. మళ్లీ... అక్కడా!.. అతల్లికీ..?

**కథ కుడు**:- అహా! అలాంటిదేమీ లేదు తమ్ముడా!

**వంత(2):-** మరి?

**కథకుడు:-** ఆ తిరుమల పుణ్యక్షేత్రంలో చాలకాలంనుండీ ఆత్మారాందాస్‌జీ గారనే మహంతు పరిచారకులవల్ల ఆ తల్లిని గురించి వినివున్నాడు కనుక, ఆ మరునాడు ఆమెవద్దకు వచ్చి...

**వంత(1):-** ఆఁ! వద్దకు వచ్చి....

**కథకుడు:-** స్వామివారి కోవెలకు తూర్పు మాడవీధిలో రాతితేరుకు కుడివైపు పూరింటిని ఆమెకు నివాసంగా ఏర్పాటు నాడయ్యాలూ!

**వంత(2):-** ఆహాహా! ఎంతగొప్ప మనసయ్యా ఆ మహంతుదీ!

**కథకుడు:-** అంతేకాదు నాయనలారా!

**వంత(1):-** మరింకా ఏమిటి నాయనా!

**కథకుడు:-** ప్రతిరోజూ స్వామివారి వంటశాలనుండి పడిబియ్యం, అందుకు తగిన తదితర పదార్థాలూ వకుళమాలిక పేర ఆమెకు కుటీరానికి పంపే ఏర్పాటు చేశాడయ్యా!

**వంత(2):-** ఆహాఁ ఎంతగా ఆదరించినాడయ్యా! ఆపెద్దాయన!

**కథకుడు:-** అందు కా తల్లి..వెంగమాంబ...ఎంతగానో సంబరపడింది.

**వంత(1):-** ...సంబరపడీ...

**కథకుడు:-** ఇదంతా ఆ అలమేలు మంగమ్మ అనుగ్రహమేనని ఎంతో ఆనందపడింది.

**వంత(2):-** ఆఁఆఁ...అలా ఆనంద పడిన తరువాతా....

**వంత(2):-** తరువాతేంజరిగిందయ్యారో!...

**కథకుడు:-** తరువాతేమున్నదయ్యా! ఆతల్లికి నిత్యమూ స్వామిదర్శనభాగ్యమే ఆ దర్శనానందమే! ఆ ఆనంద పారవశ్యములో స్వామిని గూర్చి కీర్తనలు పాడడమే ఆ తల్లి పని!

**వంత(1):-** అయ్యా!

**కథకుడు:-** ఆఁ

**వంత(1):-** ఏదయ్యా! ఆ తల్లి స్వామిపై చెప్పిన ఒక్క కీర్తన వినిపించవయ్యా!

**వంత(2):-** ఔనయ్యా! వినిపించవయ్యా!

**కథకుడు:-** అలాగే తమ్ములారా! (ఆలాపన)

"శ్రీ వేంకటేశ! మోక్షము జెందేకొఱకు-
సేవలేమిజేతునేనూ?
కావుమనుచు జొచ్చున్నెడ-
కడతేర్చ మీభారమేనూ-
భూవరాగ్రణులెంతొ బుద్ధిమంతులయినా-
పొగడిసేవల జేయలేనూ-
భావించి శ్రీదేవి నీవేకమై వొక్క-
పనిజెప్పితే చేసేనూ-
తరిగొండాధిప! మిమ్ము మరగిన మనసింక-
తప్పించి యికనెందు బోదూ-
శరణాగతత్రాణ బిరుదు గలిగితె మమ్ము
సర్వత్ర విడనాడరాదూ-
పరమాత్మ! మమ్మిక విడనాడితే వేరె-
ప్రాపు మా కెక్కడా లేదూ-
నిర్వాణఫలమివ్వ నిక నెందుబోదూ"

**వచనం:-** అంటూ స్వామివారిని గూర్చి అద్భుతంగా పాడిందయ్యా!

**వంత(1):-** అయ్యా! ఆ తల్లి పాటవింటూంటే నామనసంతా ఎక్కడో తేలి పోయిందయ్యా!

**వంత(2):-** నామనసయితే ఆ ఏడుకొండలవాడి పాదాలచెంతే నిలిచిపోయిందయ్యా!

**వచనం:-** ఆ విధంగా స్వామిని కీర్తిస్తూ....

**వంతలు:-** (దరువు) అహఁ

**వచనం:-** తనకుటీరం వద్ద తులసిమొక్కలు, పూలతీగలు పెంచి పోషిస్తూ....

**వంతలు:-** ఆహఁ

**వచనం:-** స్వామికి పూలూ, తులసిమాలలూ నమర్పిస్తూ వుండిన దినాల లోనే "విష్ణుపారిజాతం" అనే యక్షగానం వ్రాసిస్వామికి సమర్పించిందయ్యా!

**వంత:-** ఆహఁ! తదుపరి!

**వచనం:-** ఆ తల్లి భక్తినీ, కవితాశక్తినీ వినిన, అక్కడే సంకీర్తనాచార్య పదవిలో వున్న తాళ్లపాకవంశీయులు ఆమెను ఆహ్వానించి-

**వంత(1):-** ఆహ్వానించి-

**వచనం:-** తమయింటికి సమీపంలో ఉత్తరమాడవీధిలో నున్న తమ చిన్న మిద్దె ఒకదాన్ని ఆమెకు నివాసంగా యిచ్చినారయ్యా!

**వంత:-** భళా! మంచివాళ్లకు ఎక్కడయినా మంచే జరుగు తుందయ్యా!

**వచనం:-** కానీ-- -

**వంత(1):-** అ-- బ్బా-- మళ్లీ ఈ - కానీ - దాపరించిందా స్వామీ!

**వంత(2):-** దాన్ని వింటేనే మాకుఒళ్లంతా కంపరమెత్తుతుంది సామీ!

**వచనం:-** అక్కడా ఆ తల్లికి కడగండ్లు తప్పలేదు సోదరా!

**వంత(1):-** అదేమిటయ్యా? స్వామి సన్నిధిలోనూ కష్టాలేనా!

**వచనం:-** ఔను. తాళ్లపాకవారి పరిచయం వల్ల -- ఆయింటి పూర్వ కవయిత్రి తాళ్లపాక తిమ్మక్క-

**వంత(2):-** తిమ్మక్కా? ఈమెవరు సామీ!

**వచనం:-** శ్రీవేంకటేశ్వరుణ్ణి పదాల వర్షంలో ముంచెత్తిన తాళ్లపాక అన్నమయ్య సతీమణి. ఈమే కవయిత్రే. సుభద్రా కళ్యాణం అనీ వ్రాసింది.

**వంత(1):-** వ్రాస్తే మన కేమంటా?

**వచనం:-** మన కే మంటా లేదూ, రాలేదూ నాయనా! అచాయలో మన వెంగమాంబ 'రమాకల్యాణం' అనే 'పెండ్లిపాట' ఒకటి బహురమ్యంగా వ్రాసింది.

**వంత(2):-** వ్రాస్తే!

**వచనం:-** దానివలన ఆమె తిరుమలలో చాలాప్రసిద్ధురాలై పోయింది.

**వంత(1):-** ఇంతకంటే మరింకేం కావాలెనయ్యో! --- (రాగం)

**వచనం:-** ఆ ప్రసిద్ధే....అక్కడ ఓ అల్పబుద్ధివానికి ఈసు కలిగించింది!

**వంత(2):-** ఎవరా అల్పబుద్ధి? ఏమా కథ? వినిపించవయ్యా!

**కథకుడు:-**(తాళంవేస్తూ - రాగందీసి)

"వినుడు వినుడోరయ్య! సోదరా!
కనుడు కనుడో - కత్తి వాదరా - ॥ తందనతానా - తందనతానా॥
బత్తురాలు వెంగమాంబ - కుత్తుకమీదా
కత్తినెత్తిన నక్క - అక్కారామయ్యా ॥ విను॥ ॥తం॥

**వంత(1):-** ఈ నక్క - అక్కారామయ్య ఎవరండీ మధ్య!

**కథకుడు:-**చెబుతున్నాను వినండన్నలూ!
"వెంగమాంబ యింటి - ప్రక్కనే రామయ్య
దీక్షితులు - ఒక్కరున్నారు -

**వంతలు:-** ఉన్నారు.

**కథకుడు:-**"రొక్కమున్నావాడు - ప్రక్కనేయున్నాడు
అర్చకా సంఘాన - పెద్దమనిషైనోడు"

**వంతలు:-** పెద్దమనిషైనోడు"

**కథకుడు:-**"డబ్బులుండీ బాగ - మాటచెల్లేవాడు
దర్పాన బిర్రుగా - విర్రవీగిపోయె"

**వంతలు:-** వీగిపోయె"

**కథకుడు:-**"ఇంతగొప్పవాణ్ణీ - నేనూ ॥తందాన॥
ఇంత పేరున్నోణ్ణీ - నేనూ ॥తందాన॥

ఇంతగొప్పోవాణ్ణి - ఇంత పేరున్నోణ్ణి ॥తందాన॥
నాయింటి ప్రక్కనా! - ఈ వితంతువు ఇంతి! ॥తందాన॥

**వంతలు:-** "తందానో - తందానో -- తానతానతాన తందానో.
తరికిట తరికిట ఝం"

**వచనం:-** అంటూ తనయింటి ప్రక్కనే వెంగమాంబ వుండడమూ, ఆ తల్లి కవితల నల్లడమూ, స్వామిని సేవించటమూ, పేరు ప్రఖ్యాతి రావటమూ --- సహించలేక- ఆమెను - ఎవరిని!

**వంత(1):-** ఆ తల్లి - వెంగమాంబను-

**వచనం:-** ఆఁ ఆ తల్లి వెంగమాంబనే - ఆ భక్తురాలినే - సూటిపోటి మాటలతో, వెకిలివెకిలి కూతలతో నిందించేవాడు.

**వంత(2):-** ఔరా!

**వచనం:-** తనశిష్యులతో గేలిచేయించేవాడు.

**వంత(1):-** ఛీ ఛీ ఛీ!

**వచనం:-** ఎన్నిచేసినా ఆ తల్లి భూమాతలా సహనంతోవుంటూ

**వంతలు:-** ఉంటూ...

**వచనం:-** ఆ ఏడుకొండల వేంకటేశ్వరుణ్ణే

**వంతలు:-** ఆఁ, ఆ వేంకటేశునే!

**కథకుడు:-** (చిందులువేస్తూ, - దరువేస్తూ)
"శరణు శరణు! నందా కుమారా! శరణు శరణూ!
శ్రీకర! దుర్జన భీకర! వర మో
క్షాకర! పూర్ణనిశాకర వదనా!

**వంతలు**:- భళాభళ!
"సుందరవిగ్రహ! మందరధర! ముచు
కుంద వరద! గోవింద! ముకుందా!

**వంతలు**:- భళాభళ!
వర తరిగొండ నివాస! పరాత్పర!
గురుతర వేంకటగిరి వరనిలయా! శరణు శరణు!?"

**వంతలు**:- భళా భళిరా! భళా! భళా భళిరా! తందాన తాన తందనాన! అంటూ శరణువేడినదయ్యా!

**వంత(1)**:- అయితే వెంటనే స్వామి అనుగ్రహించినాడా!

**కథకుడు**:- లేదు నాయనా! వేడిన వెంటనే స్వామివారు వస్తే వారికేం విలువ వుంటుంది నాయనా!

**వంత(2)**:- అందుకని!

**కథకుడు**:- స్వామి భక్తులను పరీక్ష జేస్తాడు. అందుకే రాలేదు.

**వంత(1)**:- అయ్యో!మరి- ఆ నక్కాదీక్షితయ్య వూరుకుంటాడా!

**కథకుడు**:- ఊరుకోడు! ఊరుకోలేదుకూడా! తనయింట విందారగించిన వారి ఎంగిలాకులన్నిటినీ ఆ యమ్మ - తరిగొండ వెంగమాంబ పెరట్లోకే చల్లించినాడు.

**వంత(2)**:- గోవింద! గోవింద! ఎంతపాడుపనీ! ఎంతపాడుపనీ!

**వంత(1)**:- అప్పుడా తల్లి ఊరకున్నదా!

**కథకుడు**:-ఆ తల్లి బహు ఓరిమిగల తల్లి! ఏమీ అనలేదు. వాటి నన్నిటినీ శుభ్రం చేసేది. తులసికోట వద్ద అలికి అంటు లేకుండా చేసేది. అది దీక్షితులవారికి మరీ అలుసైపోయి - రోజూ ఆ పనే చేయించేవాడు.

**వంత(1)**:- ఓరి వీడి దుంపాతెగా!

**వంత(2)**:- వాని తాడు తెగా!

**కథకుడు**:-ఒక రోజేమయిందంటేనూ--

**వంతలు**:- అంటేనూ -- (దరువు)

**కథకుడు**:-"వెంగమాంబ తల్లి -వెంగమాంబ తల్లి
పెరడు శుభ్రముచేసెనూ ॥తందానతానా॥
మడిగట్టి, కోటకూ - దడిగట్టి, తిన్నెపై
ధ్యానమ్మునను మున్గెనూ॥తందానతానా॥
ఎంతసేపయ్యిందో - ఎంతసేపయ్యిందొ
తనను తానే మరిచెనూ ॥తందానతానా॥
చలనమే లేకుండ - సమాధిముద్రలో
కదలకుండా వుండెనూ ॥తందానతానా॥

**వచనం**:- అప్పుడే-

**వంతలు**:- ఏ --

**వచనం**:- యథాప్రకారం అక్కారామయ దీక్షితులు ఇంట్లో విందారగించిన అనంతరం ఎంగిలాకులన్నింటినీ వెంగమాంబ పెరడులోకి విసరివేయించినాడు. ఆ చల్లడంలో వెకిలిముదిరి, తల బిరుసెక్కి వెంగమాంబపైన కూడా పడేలాగున విసరివేయటం వలన---

**వంతలు**:- వలనా--

**వచనం**:- ఆ ఎంగిలాకులు ధడాల్న వెంగమ్మ ఒడిలో వచ్చి పడ్డాయి. అమె ఉలికిపడి తటాల్న కళ్లు తెరిచింది.

ధ్యానభంగ మయింది. ఎన్నడూ రాని ఆతల్లికి అమితమైన కోపం వచ్చింది -- అంతే.

**వంత(1):-** ఎట్లా! అంతటి శాంతమూర్తికీ చాలా కోపమే?

**వంత(2):-** వచ్చి- ఏంచేసిందయ్యరో--?

**కథకుడు:-**(చిందులతో)

"ఎవడురా! ఆపాపి? - ఎవడురా! ఆపాపి?
ఎంగిలాకులు వేసెనూ -- ॥తందాన॥
ఏడుకొండలవాని - తలపులో నేనుండ
నా పాదముల వేసెనూ - ॥తందాన॥
వాడు వానీ వంశ - వాసి వంశామెల్ల
నిర్వంశమై పోవురా! ॥తందాన॥
పాడు బుద్ధీవాని కుదురూ-
పాడె గట్టగ నిల్చు కదరా! ॥తందాన॥

**వచనం:-** అంటూ అకస్మాత్తుగా కలిగిన కోపావేశంతో శాపనార్థాలు పెట్టింది సోదరా!

**వంత(1):-** అహ! అహ! పెట్టిందా!

**వంత(2):-** బలెబలె! రోగం కుదిరింది దీక్షితులకు!

**వచనం:-** ఆ తల్లి మాట వేదవాక్కు. ఋషులవాక్కు. అలా అన్నదోలేదో-

**వంతలు:-** ఆ! ఏమైందేమయిందీ!

**వచనం:-** అప్పటికప్పుడే ఆయింట తిండి తిన్న చాలమందికీ, ఇంటి వాళ్లకీ వాంతులూ, విరేచనాలూ అయి, అకాలమృత్యువు దాపరించింది, దీక్షితులకు కాలూచేయీ పడి పోయినాయి.

**వంత(1):-** బాగా జరిగింది. చేసుకున్న వారికి చేసుకున్నంత గోవిందా!

**వంత(2):-** పాపం ఊరికేపోతుందా! శాపం తగలక మానుతుందా!

**వచనం:-** వెంటనే రామయదీక్షితులు వెంగమాంబ యింటికి పోయినాడు.

**వంతలు:-** ఆఁ పోయి-

**వచనం:-** క్షమించమంటూ ఆమెపాదాలపై బడినాడు. ఆతల్లి శాంతించింది. 'నీవంశం నిర్వంశమేమీ కాదులే. అయితే తరానికి ఒక్కడుమాత్రమే బ్రతికి బట్టగడతాడు అంతే' నంటూ అభయమిచ్చింది.

**వంత(1):-** ఆహాఁ! మంచిది గనకే శాంతించి అనుగ్రహించింది.

**కథకుడు:-** అయితే, ఇక తనకక్కడ మనశ్శాంతి వుండదనీ తెలుసుకొన్న ఆ తల్లి..

**వంతలు:-** అయ్యో! ఏంచేసిందయ్యో?

**కథకుడు:-** కారడవుల్లో జనసంచారమేలేని చోటికి, ఎవరి పీడా లేని ఏకాంత స్థలానికి వెళ్లి-

**వంతలు:-** ఆఁ.. వెళ్లి..!

**కథకుడు:-** తపస్సు చేసుకోవాలని నిశ్చయించుకుంది. వెంటనే బయలు దేరిందయ్యారో!.

**వంత(1):-** ఎక్కడికి బయలుదేరిందయ్యా! పాపం? ఆ ఆడ కూతురు!

**వంత(2):-** అందునా ఒంటరిగా - అడవులలోకీ!

**కథకుడు**:- "తుంబురుకోన" అనీ - ఆ ఏడుకొండల వాడున్న కొండకు పశ్చిమోత్తరంగా లోయలోవుందా కోన. అక్కడయితే తన తపస్సుకు ఏభంగమూ రాదని - బయలుదేరింది - అప్పుడు.

**వంత(1)**:- ఆఁ - అప్పుడూ?

**కథకుడు**:- ఆ తల్లి ఏడుకొండలవాడిని సెలవీయవలసినదంటూ ఇలా ప్రార్థించిందయ్యా!

**వంత(2)**:- ఆహాఁ! ఏదయ్యా! ఆ తల్లి ప్రార్థన వినిపించవయ్యా!

**కథకుడు**:- (ఆలాపన తీస్తూ)

"శ్రీనివాసస్వామి! - సెలవీయవయ్యా!
నానాప్రకారముల - నను గావవయ్యా!
తెరగొప్ప నే స్వతం - త్రించినానని మదిని
పరమాత్మ! నీవు కో - పము నుంచవలదూ
సుర వినుతమైన - తుంబురు కోన వీక్షించి
మరలవచ్చెద ననెడి - మతి నాకు కలదూ
అలఘు భాగవతము - సమగ్రంబుగా జదువ
వలె గనుక శీఘ్రమే - వత్తు నిచ్చటికీ
నెలవుగా నాతోడు - నీడయై నావెంట
వలనుగా నీవు రా - వలయునచ్చటికే
నీవు సంకల్పించి - నిలుపుచుండిన చోట
నే వసించుట నాకు - నిష్కరుషగనుకా
దేవ! నాసంకల్ప - మే విధంబుగ సాగు
గోవింద! కృష్ణ! - తరిగొండ నరసింహా! ॥శ్రీ॥

**వచనం:-** అంటూ సంగీతభరితగానంతో ఆశు కవితాలహరితో స్వామిని అద్భుతంగా ప్రార్థించి సెలవుతీసుకొని తుంబురుకోనకు తరలి పోయిందా తల్లి!

**వంతలు:-** ఆహాఁ! ఏమి భక్తిగానం ఆ తల్లిదీ!

**కథకుడు:-** ఆ తల్లి వెంగమాంబ -- తుంబురుకోనను చూడగానే--

**వంత(1):-** ఆఁ-- చూడగానే--?

**కథకుడు:-** ఆ కోన అందాలకూ, ప్రశాంతతకూ సంబరపడిపోతూ ఆనందం పట్టలేక --- ఆ కోనపైన ఇలా కవిత గట్టిందయ్యా!

**వంత(2):-** ఎలా కట్టిందయ్యరో! మాకు వినిపించూ--

**కథకుడు:-**"వేంకటపతి తుంబురుకోనా! - నిను
వేడెదనే తుంబురు కోనా! ॥వేంకటపతి॥
(వంతలు దరువు)
పొంకముగా తుంబురుకోనా!
పోషింపవె తుంబురుకోనా! ॥వేంకటపతి॥
శ్రీవిలసిత తుంబురుకోనా! నిను
సేవించితి తుంబురుకోనా! ॥వేంకటపతి॥
పావనమగు తుంబురుకోనా!
పాప మణచు తుంబురుకోనా!" ॥వేంకటపతి॥

**వచనం:-** అంటూ ప్రార్థించిందయ్యా!

**వంతలు:-** ఆహా! ఎంత కమ్మగా వుందయ్యా కైత!

**కథకుడు:-** అంతేకాదు సోదరా!
“తీర్థమా! తుంబురుకోన తీర్థమా!
ప్రార్థించి ఫాల్గున పౌర్ణమినాడు - నే
సార్థకముగ నీలో స్నానము చేసితి;
పాపమూ - మించిన మన
స్తాపమూ - నివారించి,
ప్రాపుదాపై నన్ను కాపాడవే - దివ్య
గగనగామిని పుణ్యతీర్థమా!”

**వచనం:-** అంటూ ఆ తుంబురుకోన పుణ్య తీర్థాన్ని ఈ తల్లి అభయంవేడినది. ఆపై అక్కడ ఎవరి ఆటంకాలూ లేక నిరంతరం తప స్సమాధిలో మునిగి పోయేదా తల్లి.

**వంతులు:-**(దరువుతో) ఆహాఁ - తాన తందన తాన - తానాన తానా
తరిగొండవెంగమ్మా - తల్లిదీవెనా
తందాన తానా - తందాన తానా”

**కథకుడు:-**అన్నలారా!

**వంతలు:-** (దరువు) అఁ!

**కథకుడు:-**అయ్యలారా!

**వంతలు:-** ఆహాఁ!

**కథకుడు:-**ఇప్పుడు మీకొక కొత్త బిత్తరిగాడి కత చెబుతా వినరయ్యా!

**వంత(1):-** (దరువేసి) ఏమిటేమిటీ? పానకంలో పుడకలాగున అచ్చమైన బత్తురాలి కతలో ఈ మచ్చ కతేమిటయ్యా? మహానుభావా!

**వంత (2):-**ఆ తల్లి కతతో సంబంధమున్నదా స్వామీ?

**కథకుడు:-** ఉందినాయనా! ఈకథ 'పుష్కరిణీజుడు' అనేవానికథ.

**వంత(1):-** ఏమిటీ - ఫ స్కరానీ---

**వంత (2):-** (నవ్వుతూ) ఒరే - నీకు పలకటంరాదు - ఎందుకురా! అంత కష్టం?

**వంత(1):-** పోనీ నీవు పలకరా!

**వంత (2):-** వద్దులే --- కథ చెప్పు సామీ!

**కథకుడు:-** ఈ కథ చెప్పక పోతిననుకోండి-

**వంతలు:-** అనుకున్నాం (దరువు)

**కథకుడు:-** అనుకోకండి! - ఒకవేళ చెప్పకపోతే - మనతల్లి వెంగమాంబ మహిమలెలా తెలుస్తాయి!

**వంత(1):-** (ఆశ్చర్యం) ఏమిటేమిటీ! తల్లివెంగమాంబ మహిమలు చూపిందా!

**వంత (2):-** ఆహాఁ! అయితే వినాల్సిందే - తరికిటఝం॥ చెప్పండయ్యా!

**కథకుడు:-** "ఏడుకొండలవాని జూడా - ఏడనుండో వచ్చినాడూ

**వంతలు:-** "తందానా - తాన తందనానా!

**కథకుడు:-** "ఏడుకొండలా మెట్లదారిలో - నడిచి వచ్చినాడూ ॥తందనా॥
ఒడలంత కుష్టుతో - బడలి వున్నారోగి॥తందనా॥
పుడమిదెయ్యమువాడు - పూటుపాపివాడూ॥ తందనా॥
తిరుమలా చేరాడు - తిరిగి తిరిగీ మాడ
వీథులన్నీ తిరిగినాడూ --- ॥ తందనా॥
కుష్టుసోకిన వాడు - అష్టాదరిద్రుాడు
రానీరు ఎవ్వరూ - తొలగు తొలగన్నారు" ॥ తందనా॥

**వచనం:-** ఆ రకంగా ఆ బ్రాహ్మణుడు అందరిచేత దూరంగా నెట్టబడిన వాడై, స్వామిదర్శనం కాక, అలసిసొలసి, ఆకలిదప్పులతో, ఆదరించేవారు లేక, దారితప్పి తిరుమల అడవులలో----

**వంతలు:-** పాపం! అడవులలో---?

**వచనం:-** "గోవిందా! అయ్యో! రామా! నామొర వినువారే లేరా!" అంటూ ఆక్రోశిస్తూ, అలమటిస్తూ, తిరిగీతిరిగీ---

**వంతలు:-** ఆ--- తిరిగీ తిరిగీ,

**వచనం:-** వాని అదృష్టవశాన - తుంబురుకోన చెంతనే చేరి బిగ్గరగా ఆర్తనాదం చేయసాగినాడయ్యా!

**వంతలు:-** అహఁ!

**వచనం:-** ఆ దీనుని ఆర్తనాదం ధ్యానముద్రలోనున్న వెంగమాంబ చెవుల బడింది. ఆమె చిత్తగతి తప్పింది. దారికానని దీనుని రక్షించడమే తన తత్క్షణ ధర్మమను కొని లేచింది.

**వంత(1):-** లేచి-

**వచనం:-** ఆ కేకలు వినబడిన దిశగా నడిచి కుష్టుబాధతో ఆకలితో స్వామి దర్శనం లభించకపోయెనే! అనిన చింతతో అనేకంగా బాధపడుతున్న ఆ బ్రాహ్మణుణ్ణి చూచి జాలిపడి, తన ఆశ్రమానికి తెచ్చినదయ్యా!

**వంత(2):-** -- తెచ్చీ--

**వచనం:-** అతనికి ఉపచారములు చేసింది. ఆకలితీర్చింది అంతేకాదు-

**వంత(1):-** ఆఁ ఆఁ ఇంకా ఏమిచేసిందయ్యా!

**వచనం:-** "ఆ ఏడుకొండల వానిదయవలన త్వరలోనే నీ ఆరోగ్యమూ కుదుట పడుతుంది. అయితే -- నన్నిచ్చట చూచినట్లు నీవెవరి తోనూ చెప్పరాదుసుమా! చెప్పితివో తక్షణమే మృతినొందెదవు జాగ్రత్త!" అని హెచ్చరించింది-

**వంత(2):-** -- హెచ్చరించి!

**వచనం:-** "ఆ సమీపంలోని తుంబురు తీర్థంలో మునిగి కనులు మూసుకో" మన్నది. ఆ బాపనయ్య కనులు మూసుకున్నాడు. మఱికొన్ని క్షణాలకు కళ్లు తెరిచాడు! ఏమి చెప్పెదను సోదరా!

**వంత(1):-** ఏమయింది దేవరా!

**వచనం:-** వింతలోకెల్ల దొడ్డవింత!

**వంత(2):-** ఏమా వింత స్వామీ!

**వచనం:-** ఆ బాపనయ్య తిరుమలలో స్వామివారి పుష్కరిణిలో స్నానాలు చేస్తూవున్నవారి మధ్యనుండీ - అందరూ ఆశ్చర్యపోతుండగా లేచి నాడయ్యరో!---

**వంతలు:-** మాకున్నూ ఆశ్చర్యమేనయ్యరో!---

**వచనం:-** అదే వెంగమాంబ మహిమ మరి! ఆ తల్లి మహిమవల్లే అక్కడివాడు ఇక్కడ తేలినాడు. పుష్కరిణిలోనుండి రావడంచేత అతడు 'పుష్కరిణీజుడు' అయినాడు.

**వంత(2):-** అర్థమయింది! అర్థమయింది!

**వచనం:-** "ఇక్కడి కెలా వచ్చావయ్యా! పుష్కరిణీజా!" అనడిగారు తైర్థికులు. వెంగమాంబ చెప్పిన మాటలు మరచి పోయినాడా సంబరంలో.

**వంత(1):-** ఎందుకు మరచినాడయ్యా!

**వచనం:-** వాని ప్రారబ్ధం! విధినెవరూ తప్పించలేరు నాయనా! వానికా జన్మను అంతే వ్రాసి పెట్టివున్నది కనుక, మరచినాడు....ఇదంతా వెంగమాంబమహిమ అనీ, ఆ తల్లి తుంబురుకోనలో వున్నదనీ తెలిపినాడందరికీ- అంతే---

**వంత(2):-** ఇక అంతేనా!

**వచనం:-** అంతే మరి! వెంటనే వానిప్రాణాలు ఆ శ్రీనివాసునిలో లీనమైపోయినాయి.

**వంతలు:-** 'తానానా' - తానతందనానా - తరికిట తరికిట తరికిటఝుం తరినానా!
మరయితే తిరుమల జనం ఏంచేసినారో
వివరించవయ్యా!

**కథకుడు:-** అన్నలారా! తమ్ముళ్లారా! అయ్యలారా! అదృశ్యమై పోయిన ఆతల్లి ఆ ఏడుకొండలవానిలోనే లీనమై పోయిందనే అనుకున్నారు తిరుమల యాత్రికులు, నివాసజనము కూడా.

**వంతలు:-** కూడానూ-

**కథకుడు:-** కానీ - ఆ యమ్మ - ఆమహాభక్తురాలు వెంగమాంబ జీవించేవున్నదనీ - తుంబురుకోనలో వున్నదనీ తెలిసి మహాసంబర పడిపోయినారు.

**వంతులు:-** పోయినారు-

**కథకుడు:-** అందరూ కలిసి అక్కడికే పోయినారు "అమ్మా! తల్లీ! వెంగమాంబా! మహాభక్తురాలా!'

**వంత(1):-** భక్తురాలా!

**కథకుడు:-** నీవు లేని తిరుమల బోసిపోయినాదమ్మా!

**వంత(2):**-పోయినాదమ్మా!

**కథకుడు:**-మాపై దయవుంచి, స్వామిసేవకై మళ్లీ తిరిగి
తిరుమలకు రావమ్మా! - అంటూ దీనదీనంగా-

**వంత(1):**- దీనాతి దీనంగా-

**కథకుడు:**- ప్రార్థించినారు. వారిమాటనూ, అభిమానాన్నీ,
ఆహ్వానాన్నీ కాదన లేక పోయింది; తుంబురు కోనను
విడచిపోలేకా పోయింది.

**వంత(2):**- అప్పుడేమయిందయ్యరో!---

**కథకుడు:**- ఆ తల్లి రెండుచేతులూ పైకెత్తి, ఆ కోనకు మొక్కుతూ
ఆనతిమ్మని కోననువేడుకొంది. తిరుమలకు వస్తూ-

"కరుణామూర్తులు - రామలక్ష్మణులు
కాపాడిరి నన్నూ - ॥ వంతలు - నన్నూ॥

గురుతర తుంబురు కోననుండి నే
మరలి వచ్చునెడ మార్గములో నతి ॥కరుణా॥

సురుచిర కనకాంబరములు - దివ్యా
భరణములొప్పగనూ---- ॥కరుణా॥

శరచాపంబులు - సవరించుచు నా
కిరుగడలను - ముందర నడచుచు ॥కరుణా॥

తరిగొండ నృకేసరియగు - వేంకట
గిరినాయకు కృప పరగగనూ ॥కరుణా॥

శరణాగత సంరక్షణ మరయగ
తమపని యనిన విధంబున ॥కరుణా॥

**వచనం:-** అంటూ మార్గమధ్యమున ఆ రామలక్ష్మణ నరహరుల యొక్క అభేద రూపమైన శ్రీవేంకటేశ్వరుని కీర్తిస్తూ తిరుమల చేరిందయ్యారో!

**వంతలు:-** "తధిగిణ తధిగిణ తధిగిణ తోం"

**వచనం:-** ఆవిధంగా తిరుమలచేరిన వెంగమాంబ తాను క్రితంవుండిన ఇంటిలోనే తనచెల్లికూతురు తోడుగా స్వామి సేవచేస్తూ జీవించినదయ్యా!

**వంతలు(1):-**ఒక్క సందేహం వచ్చిందయ్యా!

**కథకుడు:-**ఏమిటీ నాయనా! అది?

**వంత(1):-** ఆ తల్లి వెంగమాంబకు చెల్లెలూ --- ఆమె --- కూతురు---

**కథకుడు:-** ఓహో! అదియా! కృష్ణయ్యదంపతులకు వెంగమాంబ తరువాత మరో సంతు కలిగిందయ్యా! ఆమె యుక్త వయసులో వివాహమై అత్తవారింట చేరినా - మహా భక్తురాలయిన వెంగమాంబ తన స్వంత అక్కేఅనిన అభిమానాన్ని వదలుకోలేదు. అందుకే-

**వంత(2):-** అర్థమయింది స్వామీ! తనకూతురిని పెద్దమ్మ సేవలో తరించమని పంపిందీ---

**కథకుడు:-** అంతే నాయనా! అదీ సంగతి! ఆ యింటి పెరడులో తులసీ బృందావనంఎదుట నిత్య తపస్సమాధిలో నుండేది ఆ తల్లి. ఆ దినాలలో-

**వంత(1):-** ఆఁ - ఆదినాలలో-?

**కథకుడు:-** ఒక వింత జరిగిన దయ్యారో!--

**వంత(2):-** ఏమా వింత చెప్పరో?--

**కథకుడు:-** వెంగమాంబ తననివాసానికి ఎదుట ఎత్తైన ప్రదేశంలో నూతనంగా ఒక తులసీ వనాన్ని పెంచసాగింది. ఆ తులసీవనంలోని పూలమొక్కలకు నీళ్లు కావాలి కదా!

**వంత(1):-** కదా?

**కథకుడు:-** అందు నిమిత్తం ఆ తోటలో ఈశాన్యమూలలో ఒక బావి త్రవ్వించిందయ్యా! అయితే?

**వంత(2):-** అయితే---

**కథకుడు:-**అందులో ఒక్కచుక్కనీరూ పడలేదయ్యా!

**వంత(1):-** ఓరి నాయనో! మరెలాగయ్యా?

**కథకుడు:-**అప్పుడు తల్లి వెంగమాంబ-

**వంత(2):-** ఆఁ వెంగమాంబ?

**కథకుడు:-** (ఆలాపన)

"ఓ తల్లి ! గంగాభవానీ రావే!
ఖ్యాతికి నిచటికి కపటము మానీ"
హరిపాదమున బుట్టినావు - పుర
హరుని జటాజూటమున నిలచినావు
పరమ పవిత్రమైనావు - మా
పాలిట వెలసి పూజలు గైకొన్నావు "
వాసిగ నిన్ను చాల నమ్మి - చిన్న
వాండ్ల కాదరువుగనున్న సొమ్మమ్మి
చేసితి, నిను నమ్మి పని చేయ
నిరవుగ నిచటికి బిరబిర రమ్మి! "

అంటూ కరుణరసం పొంగిపొరలేట్టుగా ఆ గంగమ్మను వేడుకొంది.

**వంత(1):-** ఎట్లాగా? పాడిపాడి వేడుకుందంటావు!

**కథకుడు:-** ఔనయ్యా! అప్పుడేమయిందో తెలుసా?

**వంత(2):-** ఎట్టా తెలుస్తుందయ్యా! చెప్పు మరీ!

**కథకుడు:-**"తల్లి మాటలే విన్నదిరా!------ సై॥"
పెల్లుబికి గంగమ్మ పొంగిందిరా! "
చల్లచల్లని - నీటి జల్లులపెల్లు "

**వంత:-** 'నీటి జల్లులపెల్లు'

**కథకుడు:-** "పెల్లుబికి గట్లనే తెంచిందిరా!
ఎల్లవారికి తుష్టి నించిందిరా!

**వంతలు:-** "శాభాసు - భళారే! - తధిగిణతోం"

**వచనం:-** దీనితో ఆ తల్లి మహాయోగినిగా, మహిమలు చూపగల యోగినిగా ప్రఖ్యాతి గాంచిందయ్యా!

**వంతలు:-**ఆ తల్లి గొప్ప భక్తురాలు! ఏడుకొండల వానినే నమ్మిన దొడ్డ మహిళామూరితి.

**వచనం:-** అంతేకాదు నాయనలారా! (రాగం)

**వంతలు:-** (దరువు)

**కథకుడు:-**"వినరయ్య సోదరా! తల్లివెంగామాంబ
అబ్బురంపు కథనూ- ॥తందాన॥
తనయిల్లు యోగినీ మఠముగా మార్చిన
తల్లి వెంగమ కథనూ-
తిరుమలేశునిలోన - తరిగొండ నరసింహస్వామిని
చూచిన విధమూ ॥తందాన॥
తండ్రియింటీనుండీ - తరలివచ్చె నృసింహ
దేవతార్చన సంపుటీ ॥తందాన॥
ఆనాటి నుండీ - భక్తవెంగమాంబ
ఉత్సవాలు జేసే ॥తందాన॥ ॥ తరికిట తరికిటథా॥

**వంత(1):-** అయ్యా! ఉత్సవా లన్నావు?

**వంత(2):-** ఏమి ఉత్సవాలు? -- ఏమిటో సెలవివ్వండీ మరి!

**వచనం:-** నాయనలారా! వెంగమాంబ, ఆమె నాయన అందరూ కూడ తరిగొండ నరసింహుని సేవకులే కదా?

**వంతలే:-** కదా?

**వచనం:-** అందుకే తరిగొండలో నిత్యమూ కృష్ణయ్య ఇంట నృసింహదేవతార్చన జరిగేది.

**వంతలు:-** అహఁ!

**వచనం:-** ఆయన కాలంచేసినపిదప ఆ స్వామికి నిత్యార్చన కరవైంది నాయనా!

**వంతలు:-** ఎంతకష్ట మెంత కష్టం?

**వచనం:-** అప్పుడు కదా!---

**వంతలు:-** ఆఁ!

**వచనం:-** ఆ దేవతార్చన సంపుటి మన తరిగొండ వెంగమాంబ మఠం చేరింది.

**వంత(1):-** భళా!

**వచనం:-** నాటినుండే ప్రతినృసింహ జయంతికీ, తిరునక్షత్రాలకూ ఉత్సవాలు జరిపి--

**వంత(2):-** జరిపి---

**వచనం:-** వచ్చిన యాత్రికులందరికిన్నీ తీర్థప్రసాదాల కైంకర్యం జరిపేది - దీనితో---

**వంత(1):-** ఆఁ ---- దీనితో?

**వచనం:-** తిరుమలవాసుని ప్రసిద్ధితో పాటు, వెంగమాంబ ప్రసిద్ధిదేశమంతటా ప్రాకిపోయింది.

**వంత(2):-** భళా!

**వచనం:-** దానితో రాజులు మన్నెదార్లు, పాళెగార్లు, జమీందారులు - అందరు కూడా స్వామిదర్శనం అయినవెంటనే వెంగమాంబ దర్శనం కూడా చేసికొనేవారయ్యా!

**వంత(1):-** ఆ తల్లికి ఎంత ప్రతిష్ఠ పెరిగిందీ!

**వంత(2):-** కానీ -- వచ్చినవాళ్లకూ ఆ తల్లి ఏం చెప్పేదయ్యా? ఆమేమన్నా గొప్పజ్ఞానా! ఋషా?

**వచనం:-** (నవ్వుతూ) అంతకంటే చాలా గొప్పది నాయనా?

**వంత(1):-** ఎట్లా?

**వచనం:-** తిరుమల వేంకటేశునకూ తరిగొండ లక్ష్మీనృసింహునకూ భేదమేలేదని ఎంచిన మహాజ్ఞాని; ఆమె గొప్పవేదాంతిని! అందుకే.

**వంత(2):-** ఆఁ--- అందుకే---?

**కథకుడు:-** తనను చూచేందుకు వచ్చిన వారిని ఉద్దేశించి---

జీవా! నీవు నినుగానలేవా? నిన్ను
భావించి చూచితే - బ్రహ్మమే కావా?
పరగ దేహము మేడిపండు - లోన
తరచుగ పురుగులు తొలిచెడు పండు
తెరచాటు మాంసపు దిండు - దీని
తెరగెల్ల చక్కగా - దెలిసితే పండు ॥జీ॥

**వచనం:-** అంటూ చక్కగా కమ్మగా వేదాంత తత్త్వాలు అప్పటికప్పుడు ఆశువుగా పాడి తెలివి కలిగించేది. అంతే కాదు----

**వంత(2):-** అఁ-ఇంకా--?

**కథకుడు:-**"సర్వం బ్రహ్మమయం - సద్గురురాయా!
సర్వం బ్రహ్మమయం "
సర్వం బ్రహ్మం - సాక్షిరూపం "
నిర్మల చిత్తం - నిత్యానందం "
సప్తజలజములు - సరగున దాటితి "
గుప్తంబగు ఆ - గురిలో కలిసితి "
ముగ్గురి పదమగు - ముక్తిని గాంచితి "
త్రిగుణము లణచితి - ధీరత గాంచితి "

**వచనం:-** అంటూ --- " సర్వం ఖల్విదం బ్రహ్మమయం జగత్" అనే ఉపనిషత్తుల సారాన్ని తేటతెలుగు మాటలతో తత్త్వంగా మలచి రమ్యంగా పాడి వినిపించేదయ్యరో!----

**వంత(1):-** అహో! అహో! చెవుల తువ్వంతా తువ్వన రాలిపోతున్నదయ్యా!

**వంత(2):-** ఔనయ్యా! ఈ తత్త్వం వింటూంటే -- కానీ - అయ్యా! నాకో సందేహం.

**కథకుడు:-** సందేహమెందుకు నాయనా? ఏమా సందేహం?

**వంత(2):-** ఆ తల్లి ఊరకే గొంతువిప్పిపాటలు పాడేదా! కాకుంటే ఏదైనా --- ఆకుల్లో - అదే - తాటాకుల్లో --- గీకేదా? అనీ.

**కథకుడు:-**ఓహో! అదా! అదే చెబుతున్నాను --- వినరయ్యా!
"వినరయ్యా! వినరయ్యా!
తరిగొండ వెంగమ్మ - రచన తీరు లెన్నో॥తందాన॥

విష్ణుపారిజాత - యక్షగానమ్మొకటి
తొలినాళ్ల రచనండీ! ---- ॥తందాన॥
పెండ్లిపాట ఒకటి - చాలా ప్రసిద్ధము
శ్రీరమా - పరిణయమూ - ॥తందాన॥

**వంతలు:-** "తరికిట తరికిట తరికిట ఝుం తరితందనానా"

**వచనం:-** ఆవిధంగా తొలినాళ్లలో ప్రారంభించిన ఆ రచనా వ్యాసంగం-

**వంతలు:-** (దరువు) అహఁ!

**వచనం:-** ఆ తల్లి మళ్లీ తిరుమల జేరిన తరువాత ఒక గొప్ప రచనా యజ్ఞంగా---

**వంత(1):-** ఎట్టా --- ఎట్టా?

**వచనం:-** ఒక రచన అనే యజ్ఞంలా నాయనా! కొనసాగించీ---

**వంత(2):-** ఆఁ కొనసాగించీ----

**వచనం:-** ఎన్నో ---- ఎన్నెన్నో --- అద్భుతమైన రచనలను అందించిందయ్యా!

**వంత(1):-** ఏమిటీ? అద్భుతమైన రచనల్ని! ఆ తబిసి?
**వంత(2):-** మేం --- నమ్మముగాక నమ్మమయ్యా!

**కథకుడు:-** (నవ్వుతూ) ఆ తల్లి మహిమ మీకు తెలుసు!

**వంతలు:-** ఆఁ

**కథకుడు:-** అందుకే......నమ్మితీరవలెనయ్యా!

**వంతలు:-** ఆ --- హ!

**కథకుడు:**-ఎందుకంటారా? వినండి మరి!

**వంతలు:**- చెప్పండి మరి!

**కథకుడు:**- (రాగాలాపన)

"అష్టఘంటముల - వ్రాయసగాళ్లూ
ఆమె - కొలువులో చేరారూ ॥తందాన॥
ద్విపదలో - శ్రీ భాగవత గాథలెల్లా ॥తందాన॥
చెప్పి - వ్రాయించిందీ --- ॥తందాన॥
గోపీనాటకమ్మను - గొల్లాకలాపము ॥తందాన॥
నరసింహ విలాస - యక్షగానమ్మూ ॥తందాన॥
వ్రాయించు కొనిపోయి.... ॥తందాన॥
నటియించేవారండీ! ॥తందాన॥

**వచనం:**- అంతేకాదు ---
శ్రీ వేంకటాచల మాహాత్మ్యచంపూ ॥తందాన॥
జలక్రీడావిలాస యక్షగానమ్మూ "
ముక్తికాంతా విలాస - యక్షగానమునూ ॥తందాన॥
వాశిష్ఠరామాయణ - ద్విపదకావ్యమ్మూ ॥తందాన॥
రచియించినాదండీ! - శ్రీ వెంగమాంబ ॥తందాన॥

**వచనం:**- ఆ తల్లి కవిత్వసృష్టి అంతటితో ఆగిపోలేదు నాయనా!

**వంత(1):**- మరింకా వ్రాసిందా?
**వంత(2):**- అయితే ఏమేమి వ్రాసినదయ్యా? ఇంకానూ-

**కథకుడు:**-"తరిగొండ శ్రీ లక్ష్మీనారసింహశతక,
మా స్వామిపేరిట - తత్త్వగీతాలు ॥తానె తందానా॥
రాజయోగా సార - మాళు కందార్థాలు॥తానె తందానా॥

ఎన్నొ సంవాదాలు - పాటల్లో వ్రాసింది
తరిగొండ శ్రీవెంగమాంబా --- ॥తానెతందానా॥

**వంతలు:-** తరికిట తరికిట తరికిట ఝుం తరితరినానా।

**కథకుడు:-**అయ్యలారా!

**వంతలు:-** ఆఁ.

**కథకుడు:-**అన్నలారా!

**వంతలు:-** ఆ --హాఁ!

**కథకుడు:-** ఆ రీతిగా ఆ మహాతల్లి - భక్తురాలు శ్రీతరిగొండ వెంగమాంబ స్వామినే మది నమ్మిన పవిత్రురాలై-

**వంతలు:-** రాలై-

**కథకుడు:-** శ్రీ శ్రీనివాసునిలోనే ఆ తరిగొండ లక్ష్మీనారసింహుణ్ణీ, శివుణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ అందరినీ అభేదదృష్టితో దర్శించీ-

**వంతలు:-** దర్శించీ--

**కథకుడు:-** యోగినియై, తాపసియై, కవయిత్రియై, వేదాంతియై పరమశాంత సహన శీలవతియై-

**వంతలు:-** సకల సుగుణాల వాలయై - ఆతల్లి--

**కథకుడు:-** నహ్రనమా జీవియై, ఎనుబదేడేళ్ళ జీవించి ఈశ్వరనామ సంవత్సరంలో శ్రావణ శుద్ధ నవమీ పవిత్ర దినం నాడు శ్రీవేంకటేశ్వర స్వామిలో లీనమై పోయిందయ్యరో!-

**కథకుడు వంతలు** (దరువులు - చిరుతలు - తాళాలు - చిందులు)
తానె తందనా - తానె తందనా - తానానె తానానె
తాన తందనా - తానె తందనానా - ధరికిట
తానతందనానా
జయజయ శ్రీ తరిగొండ వెంగమాంబకూ
జయ జయ శ్రీ తరిగొండ వెంగమాంబకూ
జయ జయ శ్రీ తరిగొండ వెంగమాంబకూ
॥జయజయజయ॥

మాధవునకు - జయమంగళం
శ్రీమహినీళునకు - మంగళం
గురుతరవేంకట - గిరిపతియై మము
మరువని సామికి - మంగళం
తరిగొండాధీశ్వరు - డై మమ్మే
మరని నృహరికిని మంగళం - జయమంగళం
తిరువేంకటనాథునకు - జయమంగళం

తరిగొండ శ్రీవెంగమాంబా
వరదుడు తిరుమల గిరివాసునకు - మంగళం
జయమంగళం - శుభమంగళం।
మంగళంమహత్

**----- 4వ భాగంము- సర్వం సంపూర్ణము-----**



